శ్రీ దుర్మతినామ సం॥ పుష్యమాస తిథివారాదయః శాలివాహనశకం ౧౮౪౩ కల్యాది ౫౦౨౨ హూణ 1922

1922 సం॥ జనవరి నెల

౩౩౦ మకరమాసము నెల

| | | | |
|---|---|---|---|
| 30 | ౧౬ | ౨౭ | శ॥శు ప్ర౧౦-౪౧ పూషా౭-౧౭ ధ్రు౦-౩౧ః ౧౦-౪౧ రావి౨-౨౧ సంక్రాం చంద్రోదయః ఉత్తరశృంగం భు౨-౪౪ |
| 31 | ౧౭ | ౨౮ | శ॥ద్వి౧౪-౧౬ ఉ॥ష౧౩-౨౪ వ్యాం ౧౮ కా౧౪-౧౬ దివి౨౪-౧౨ అహః ౨౭-౩౮ పూషా౨ రవిః౩౯-౦ తృతీయా తిథిః భు౨-౫౫ చ౧ జమాదిఉలవల్ |
| 1 | ౧౮ | ౨౯ | ఆ॥తృ౧౯-౬ శ౧౯-౦ వరం౦-౪౦ గ౧౯-౬ రావి౨-౧౬ శూన్యతిథిః భు౩-౭ చ౨ |
| 2 | ౧౯ | ౩౦ | సో॥చ౨౪-౨౨ ధని౨౫-౨౨ వ౧-౪౩ భ౨౪-౨౨ రావి౧౭-౪౨ చతుర్థి తిథిః ప్రాగ స్తంశుక్రః శుక్రమౌఢ్యారంభః భు౩-౧౮ చ౩ |
| 3 | ౨౦ | ౧ | మం॥ప౨౯-౪౦ శత౩౨-౬ ని౩-౧౩ బా౨౯-౪౦ రావి౧౧-౫౭ అహః ౨౭-౪౦ పూషా౩ రవిః౫౪-౧౦ దగ్ధమృత్యుయోగౌ భు౩-౨౯ చ౪ |
| 4 | ౨౧ | ౨ | బు॥ష౩౫-౦ పూభా౩౮-౨౨ వ్యతీ౪-౨౪ కౌ౨-౨౩ త్యాజ్యాభావః భు౩-౪౧ చ౫ |
| 5 | ౨౨ | ౩ | గు॥స౩౯-౩౦ ఉ॥భా౪౪-౧౩ వ౫-౨౪ గ౭-౨౦ ౭౪-౪౬ శవె రావె భు౩-౫౨ |
| 6 | ౨౩ | ౪ | శు॥అ౪౩-౨౩ రేవ౪౮-౪౯ వరి౫-౨ భ౧౧-౩౩ ౭౧౬-౨౪ దగ్ధ అమృతసిద్ధయోగాః భు౪-౩ చ౭ |
| 7 | ౨౪ | ౫ | శ॥న౪౫-౫౪ అశ్వ౫౨-౯ ౫-౩ బా౧౪-౩౮ అహః ౨౭-౪౨ రావి౧౪-౧౦ పూషా౪ రవిః౯-౪౨ భు౪-౧౫ చ౮ |
| 8 | ౨౫ | ౬ | ఆ॥ద౪౭-౦ భర౫౪-౫౬ సి౩-౪౦ తై౧౬-౪౯ ౨౧౭-౨౮ భు౪-౨౬ చ౯ |
| 9 | ౨౬ | ౭ | సో॥ఏ౪౬-౪౭ కృ౫౬-౧౬ సా౧-౩౦ శు౫౬-౫౬ వ౧౭-౦ దివి౨౫-౪౧ ప. దశితిముఖః ౪౬-౩ శైవతమ స్వాదిః సర్వేషామేకాదశి వైకుంఠయేకాదశీ శ్రీరంగక్షేత్రే ద్వారదర్శనం భు౪-౩౭ చ౧౦ [కూర్మద్వాదశి భు౪-౪౯ చ౧౧ |
| 10 | ౨౭ | ౮ | మం॥ద్వా౪౫-౨౪ రో౫౬-౧౨ శు౫౧-౩౯ బ౧౬-౬ దివి౮-౨౨ పాతాభావః అహః ౨౭-౪౬ ఉ॥షా౧ రవిః౨౫-౭ |
| 11 | ౨౮ | ౯ | బు॥త్ర౪౨-౪౯ మృ౫౪-౫౯ బ్ర౪౮-౪౯ కా౧౪-౭ ౨౯-౪౫ భు౫-౦ చ౧౨ [చ౧౩ |
| 12 | ౨౯ | ౧౦ | గు॥చతు౩౯-౧౨ ఆర్ద్ర౫౨-౪౮ ఐ౪౨-౩౭ గ౧౦-౫౧ ది౧౫-౩ చిదంబరక్షేత్రే ఆర్ద్రాద్వారదర్శనోత్సవం భు౫-౧౧ |
| 13 | ౩౦ | ౧౧ | శు॥ ○ పూ౩౪-౯ పునర్వ౮ వై౩౫-౪౫ భ౭-౧౧ దివి౨౦-౪౮ అహః ౨౭-౪౮ ఉ॥షా౨ మకరే రవిః౪౦-౩౭ అన్వాధానం భు౫-౨౨ చ౧౪ [కాపర్యంతం కూష్మాండదానాని భు౦-౨ చ౧౫ |
| 14 | ౧ | ౧౨ | శ॥కృ ప్ర౨౯-౫౫ పుష్య౪౬-౪౮ వి౨౮-౩౨ బా౨-౭ ౪౮-౧౧ యాగకాలః ఉత్తరాయణపుణ్యకాలః పంచఘటి |
| 15 | ౨ | ౧౩ | ఆ॥ద్వి౨౪-౨౨ అశ్లే౪౨-౯ ప్రీతి౨౦-౨౭ గ౨౪-౨౧ దివి౬-౦ ద్వితీయాతిథిః భు౦-౧౨ చ౧౬ [భు౦-౨౩ చ౧౭ |
| 16 | ౩ | ౧౪ | సో॥తృ౧౮-౩౩ మ౩౭-౯ ఆ౧౩-౧౦ భ౧౮-౩౩ వి౧౦-౪౪ రావి౨౮-౩౪ ఉ॥షా౩ రవిః ౫౬-౫౫ తిథిద్వయం |
| 17 | ౪ | ౧౫ | మం॥చ౧౨-౪౯ పూఫ౩౩-౪౮ సౌ౫-౧౫ శో౫౨-౭ బా౧౨-౪౯ శేషః౦-౧౮ రావి౨౨-౪౭ భు౦-౩౪ చ౧౮ |
| 18 | ౫ | ౧౬ | బు॥ప౬-౫౨ ఉ॥ఫ౨౯-౫౧ అతి౪౯-౪౬ తై౬-౫౨ రావి౨౧-౪౪ భు౦-౪౫ చ౧౯ [భు౦-౫౬ చ౨౦ |
| 19 | ౬ | ౧౭ | గు॥ష౧-౨౪ ఏష్యం౫౪-౫౪ హ౨౬-౧౮ సు౪౨-౩౪ వ౧-౨౪ రావి౧౭-౨౭ త్రిస్పృక్ కాం కూరత్తాళ్వారుతిరు |
| 20 | ౭ | ౧౮ | శు॥అ౫౨-౫౭ చి౨౩-౨౧ ధృ౩౫-౫౬ బా౨౪-౧౨ రా౮-౫౭ అహః ౨౭-౫౪ ఉ॥షా౪ రవిః౧౨-౨ భు౧-౬ చ౨౧ |
| 21 | ౮ | ౧౯ | శ॥న౪౮-౪౫ స్వా౨౧-౧౩ శూ౨౯-౫౮ తై౨౦-౨౫ రా౭-౨ దగ్ధసిద్ధయోగౌ భు౧-౧౭ చ౨౨ |
| 22 | ౯ | ౨౦ | ఆ॥ద౪౬-౨౭ వి౧౯-౫౯ గం౨౪-౪౬ వ౧౭-౩౬ రావి౨-౪ కుంభాయనగతోరవిః ౯-౪౪ పాతాభావః భు౧-౨౮ |
| 23 | ౧౦ | ౨౧ | సో॥ఏ౪౫-౧౦ అనూ౧౯-౫౨ వృ౨౦-౨౭ బ౧౫-౫౪ ౮ వి౬-౧౧ అహః ౨౭-౫౬ శ్ర౧ రవిః౨౭-౫౪ సర్వేషామేకా |
| 24 | ౧౧ | ౨౨ | మం॥ద్వా౪౫-౧౭ జ్యే౨౧-౬ ధ్రు౧౭-౧౫ కౌ౧౫-౧౪ త్యాజ్యాభావ భు౧-౪౦ ౨౫ [దశిభు౧-౫౧ చ౨౪ |
| 25 | ౧౨ | ౨౩ | బు॥త్ర౪౭-౪ మూల౨౩-౨౦ వ్యా౧౪-౪౮ గ౧౬-౧౦ శి౧౯-౧౦ రా౨౦-౪ భు౨-౦ చ౨౬ [త్రిః భు౨-౧౧ చ౨౭ |
| 26 | ౧౩ | ౨౪ | గు॥చతు౪౯-౨౦ పూషా౨౬-౫౯ హ౧౩-౫౧ భ౧౮-౧౨ రా౨౦-౨౦ అహః ౨౮-౦ శ్ర౨ రవిః౪౪-౨౦ మాసశివరా |
| 27 | ౧౪ | ౨౫ | శు॥ ● అ౫౩-౯ ఉ॥షా౩౧-౩౯ వరి౧౩-౪ చతు౨౧-౨౪ రా౧౪-౩౧ పిండపితృయజ్ఞః అన్వాధానం భు౨-౨౧ చ౨౮ |

| | | |
|---|---|---|
| కే | | |
| | శు౧౫ మకరే రవి<br>శు౭ మకరే బుధః<br>బ౧౪ కుంభే బుధ<br>బ౫ మకరే శుక్రః | |
| ర-బు శు | కు | గు-శ రా |

| | | | | |
|---|---|---|---|---|
| కుజచారః. | శు౩ పూషా౪ బు౬-౨౦ | బ౫ శ్రవ౪ బు౧౪-౨౮ | శు౪ మూ౪ శు౫౩-౨౦ | బ౯ ఉ॥షా౩ శు౨౫-౧౪ |
| శు౩ స్వా౨ కు౫౮-౨౩ | శు౫ ఉ॥షా౧ బు౫-౨౦ | బ౮ ధని౧ బు౩౨-౧౮ | ప్రాగ స్తంశుక్రః౬-౧౮ | బ౧౨ ఉ॥షా౪ శు౨-౩౦ |
| శు౯ స్వా౩ కు౪౨-౧౧ | శు౭ ఉ॥షా౨ బు౫-౨౦ | బ౧౧ ధని౨ బు౧౦-౪ | శు౭ పూషా౧ శు౩౦-౨౪ | బ౧౪ శ్రవ౧ శు౩౬-౨౦ |
| శు౧౫ స్వా౪ కు౩౫-౯ | శు౯ ఉ॥షా౩ బు౪-౩౦ | బ౧౪ ధని౩ బు౫౨-౨౦ | శు౧౦ పూషా౨ శు౬-౨౦ | శనిచారః. |
| బ౬ విశా౧ కు౩౧-౨౦ | శు౧౧ ఉ॥షా౪ బు౧౩-౦ | గురుచారః | శు౧౨ పూషా౩ శు౪౪-౨౧ | బ౩ శనివక్రారంభః౫౮-౧౧ |
| బ౧౩ విశా౨ కు౩౮-౨౦ | శు౧౩ శ్రవ౧ బు౨౨-౧౮ | శు౧ చి౨ గురుః ౩౬-౨౦ | శు౧౫ పూషా౪ శు౩౧-౨౦ | రాహు కేతు చారా. |
| బుధచారః. | శు౧౫ శ్రవ౨ బు౩౮-౨౪ | శుక్రచారః, | బ౩ ఉ॥షా౧ శు౯-౨౦ | శు౧౫ హ౩ రాహుః రేవ౧ |
| శు౧ పూషా౨ బు౯-౨౦ | బ౨ శ్రవ౬ బు౫౬-౧౧ | శు౨ మూ౩ శు౧౭-౦ | బ౫ ఉ॥షా౨ శు౪౨-౧౪ | కేతు౪౧-౨౦ |

28 ౧౫ ౨౬ శ॥శుక్లప్ర౫౮-౩క్ర౩౭-౬సి౧౩-౧౨కిం౨౫-౪౬రా౨౦-౩౪క్రాంయోగకాలఃమాఘస్నానప్రారంభః భు౨-౩౨
29 ౧౬ ౨౭ ఆ॥ద్వి౬౦-౦ధని౪౩-౨౩వ్య౧౪-౮బా౨౯-౧త్యాజ్యాభావః చంద్రోదయః ఉత్తరశృంగోన్నతిర్యుస్పృక్ భు౨-౪౩
30 ౧౭ ౨౮ సో॥ద్వి౩-౪౧శత౪౯-౫౯వరి౧౫-౮కౌ౩-౪౧దివి౩-౨౧అహః౨౮-౮క్రి౩రవిః౦-౨౪భు౨-౫౩చ౧జమాదిసాని
31 ౧౮ ౨౯ మం॥తృ౯-౨౩పూభా౫౬-౩౫పం౧౬-౫౭గ౯-౨౩ది౭-౫౨సిద్ధయోగః తిలచతుర్థీ భు౩-౪చ౨
1 ౧౯ ౩౦ బు॥చ౧౪-౬ఉభా౬౦-౦శి౧౭-౫౦భ౧౪-౬ది౨౨-౪౬పంచమీతిథిః శివ సోపపదం భు౩-౧౫చ౩
2 ౨౦ ౧ గు॥ప౧౮-౪౫ఉభా౨-౧౭సి౧౮-౨౭బా౧౮-౪రా౬-౩౧శూన్యతిథిః అహః౨౮-౧౮క్రి౪రవిః౧౬-౫౭సిద్ధయోగః మదనపంచమీ భు౩-౨౬చ౪
3 ౨౧ ౨ శు॥ష౨౨-౨౪రే౭-౧౬సా౧౮-౧౮తై౨౨-౨౪త్యాజ్యాభావః షష్ఠీతిథిః భు౩-౩౭చ౫
4 ౨౨ ౩ శ॥స౨౪-౩౪అశ్వ౧౧-౯శు౧౭-౧౭వ౨౪-౩౪ది౦-౩౦ రా౭-౫౪వైవస్వతమన్వాదిః రథసప్తమీ అభోజ్యార్కవ్రతం సూర్యచంద్రవ్రతంభు౩-౪౭చ౬
5 ౨౩ ౪ ఆ॥అ౨౫-౩౬భ౧౩-౫౧శు౧౫-౧౨బ౨౫-౩౬రా౧౫-౪౦అహః౨౮-౨౪ధని౧రవిః ౩౩-౫౬వైప్రః ౪౦-౩౨భీష్మాష్టమి-భీష్మతర్పణంభు౩-౫౮చ౭
6 ౨౪ ౫ సో॥న౨౫-౨౦కృ౧౫-౦బ్ర౧౨-౨౦కౌ౨౫-౨౦ రావి౨౬-౫౫నిర్గ౬-౫౦నందనవమీ భు౪-౯చ౮
7 ౨౫ ౬ మం॥ద౨౩-౪౯రో౧౫-౨౦ఐం౮-౧౯గ౨౩-౪౯రా౦-౪౯ దశమీతిథిః భు౪-౨౦చ౯
8 ౨౬ ౭ బు॥ఏ౨౧-౧౧మృ౧౪-౩౫వై౩-౨౭విష్క౫౫-౩భ౨౧-౧౧రావి౬-౨౭అహః౨౮-౨౮ధని౨రవిః౫౦-౪౫తిథిద్వయం సర్వేషామేకాదశీ భీష్మఏకాదశీ భు౪-౩౦చ౧౦ [ద్వాదశీ భు౪-౪౧చ౧౧
9 ౨౭ ౮ శు॥ద్వా౧౭-౩౨ఆర్ద్ర౧౨-౪౨ప్రీ౫౧-౩౦బా౧౭-౩౨రా౧౨-౫౦త్రయోదశీతిథిఃసోపపదం భీష్మద్వాదశీ తిల
10 ౨౮ ౯ శు॥త్ర౧౩-౫పున౯-౫౮ఆయు౪౪-౨౩తై౧౩-౫రా౦-౯వరాహకల్పాదిః భు౪-౫౨చ౧౨
11 ౨౯ ౧౦ శ॥చతు౭-౫౮పుష్య౬-౩౭సౌ౩౬-౫౭వ౭-౫౮రా౮-౧ అన్వాధానం వ్యాసపూర్ణిమా భు౫-౩చ౧౩
12 ౧ ౧౧ ఆ॥ ○ పూ౨-౨౪ఏవ్యం౫౪-౫ఆశ్రే౨-౪౮మ౫౫-౧శో౨౯-౧౦బ౨-౨౪రావి౨-౭అహః౨౮-౩౬ధని౩కుంభరవిః౭-౫౬హరిపదపుణ్యకాలఉదయప్రకృతిసంక్రమణపర్యంతంయోగకాలఃకలియుగాంతః అవమః భు౫-౧౪
13 ౨ ౧౨ సో॥ద్వి౫౦-౩౨పూఫ౫౪-౨౭అతి౨౧-౨౨తై౨౩-౩౧ది౧౭-౧౫భు౦-౭
14 ౩ ౧౩ మం॥తృ౪౪-౩౮ఉఫ౫౦-౩౮సు౧౩-౩౭భ౧౭-౪౦ది౧౧-౧౫సిద్ధయోగః శే భు౦-౧౬చ౧౬ [౧౦-౯ధని౪రవిః౨౫-౩౨శ్రాంక్రాం భు౦-౨౫
15 ౪ ౧౪ బు॥చ౩౯-౭హ౪౬-౩౪ధృ౬-౫ శూ౫౨-౪౩బా౧౨-౧౦ అహః౨౮-౪౦ది
16 ౫ ౧౫ గు॥పం౩౪-౧౩చి౪౩-౯గ౫౧-౫౩తై౬-౪౦ దివి౫ ౨౨రావి ౨౮-౨౭క్ష్యప్రః౩౭-౫౬నిర్గః౪౭-౫౭భు౦-౩౪చ౧౮ [౪౩-చ౧౯
17 ౬ ౧౬ శు॥ష౩౦-౧౬స్వా౪౧-౪౦వృ౪౫-౫౧వ౧-౧౫శేషః౧-౦రా౨౬-౨౩భు౦-
18 ౭ ౧౭ శ॥స౨౬-౨౫విశా౩౯-౫౧ధృ౪౦-౫౦భ౨౬ ౫౫ రా౨౧-౧ అహః౨౮-౪౪శతతారా౧రవిః౪౩-౧౬త్రిస్పృక్కాః-౪వభు౦-౫౨చ౨౦

| | | | |
|---|---|---|---|
| శే | | | |
| బు | శు౧౫కుంభరవి శు౧౧వృశ్చికు బ౪మకరేబుధః శు౧౪కుం శుక్ర | | |
| కు-ర | | | |
| | | శు | గు-శ రా |

19 ౮ ౧౮ ఆ॥అ౨౪-౪౦అనూ౩౯-౨౮వ్యా౩౫-౨౭కౌ౪-౪౦రా౨౪-౪౯మృత్యుయోగఃశుక్రాంభు౧-౨చ౨౧
20 ౯ ౧౯ సో॥న౨౩-౩౭జ్యే౪౦-౧౦హ౩౧-౫౪గ౨౩-౩౭త్యాజ్యాభావఃమీనాయనగతోరవిః౪౯-౨౦భు౧-౧౧చ౨౨
21 ౧౦ ౨౦ మం॥ద౨౩-౩౮మూ౪౨-౨వ౨౯-౧౬భ౨౩-౩౮రా౯-౨భు౧-౨౦చ౨౩ [భు౧-౨౯చ౨౪
22 ౧౧ ౨౧ బు॥ఏ౨౫-౭పూషా౪౫-౩౧సి౨౭-౪౧బా౨౫-౭ది౭-౨౫అహః౨౮-౫౪శత౨రవిః ౧౦-౨౫సర్వేషామేకాదశీ
23 ౧౨ ౨౨ గు॥ద్వా౨౮-౯ఉషా౪౯-౫౬వ్య౨౬-౫౬తై౨౮-౯ది౬-౫౯భు౧-౩౮చ౨౫
24 ౧౩ ౨౩ శు॥త్ర౩౧-౫౦శ్ర౫౫-౨౧వరి౨౭-౦వ౩౧-౫౦దివి౦-౫౦మహాశివరాత్రిః భు౧-౪౭చ౨౬ [భు౧-౫౬చ౨౭
25 ౧౪ ౨౪ శ॥చతు౩౭-౪ధని౬౦-౦పరి౨౭ ౫౩ భ౪-౨౭ దివి౬-౨౫ అహః౨౮-౫౮ శత౩ రవిః౧౯-౫౧ మాసశివరాత్రిః
26 ౧౫ ౨౫ ఆ॥ ● అ౪౧-౪౦ధని౧-౪౬శివ౨౯-౧౧చతు౯-౨౭ది౨౧ ౪౩పిండపితృయజ్ఞః అన్వాధానంద్వాపరయుగాదిః త్రిగ్రహకూటః భు౨-౬చ౨౮

కుజ-బుధచారౌ.
శు౩విశా౩శు౪౪-౧౧
శు౧౦విశా౪శు౪-౨౦
బ౨అనూ౧శు౧౪-౨౦
బ౯అనూ౨శు౧౮-౨౦
బ౩౦అనూ౩శు౫౮-౧౧
శు౮ధని౪బు౩౨-౧౧

శు౮బుధవక్రారంభః౫-౧౧
శు౧౧పశ్చాదస్తబు౪౩-౨౦
శు౧౩ధని౩వక్రీబు౨౨-౧౧
బ౪ధని౨వ బు౫-౧౧
బ౮ధని౧వ బు౩౬-౧౧
బ౧౩ప్రాగుదయం బుధః ౫౦-౧౧

గురుచారః.
శు౧౫గురువక్రారంభః ౪౦-౩౪

శుక్రచారః.
శు౨శ్రవ౨శు౧౩-౧౦
శు౩శ్రవ౩శు౫౧-౦
శు౬శ్రవ౪శు౩౬-౧౧

శు౯ధని౧శు౧౩-౧౪
శు౧౯ధని౨శు౫౦-౨౧
శు౧౪ధని౩శు౩౬-౨౦
బ౩ధని౪శు౫-౩౦
బ౫శత౧శు౪౦-౧౪
బ౮శత౨శు౧౮-౧౧
బ౧౧శత౩శు౫-౨౦

బ౧౩శత౪శు౪౧-౨౦
శనిచారః రాహు కేతు చారాః నష్టః.

Printed at the Andhrapatrika Press, Madras.—1921.

# ప్రస్తావన

శ్లో. ఓమ్నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే, నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీ పరమేశ్వరుని మహాసంకల్పానుసారము మహాకాలచక్రమునం దొకయేడు ముగిసినది. ఇమ్మహాచక్రపరిభ్రమణమునం దొకక్షణకాలమునందు సంభవమైన ప్రపంచప్రవృత్తిని సంభావించుట యసంభవము. బ్రహ్మాండమునం దనంతములగు గోళములు జీవజాలములు-పరమాణువులు-మహాపథమునందు నియమానుసారముగ ననుక్షణమును పరిభ్రమణము చేయుచు సృష్టిపరిణామమును పరిస్ఫుటము చేయుచున్నవి. ఒకక్షణమునం దగణ్యకోటి జీవజాలములు పుట్టుచు గిట్టుచున్నవి. అనంతమైన బ్రహ్మాండమునం దొక క్షణమునందు మహామండలములు విలయమును బొందుటయును నూతనమండలములు విసృష్టములగుటయును సంభవము. లీలారూపధారిణి - యనంతశక్తి ప్రపంచప్రవృత్తియందు మహాసంభ్రమమును గలుగజేయుచున్నది. నామరూపవిశిష్టమైన ప్రపంచమహానాటకమునం దేయణువు తేకార్యనిర్వహణమున కేర్పడినదియును గ్రహించుట దుస్తరము. ఒక భూగోళమునం దొకయేట నెన్నియో యుత్పాతములు గలుగుచున్నవి. భూకంపములు-జలోత్పాతములు- దావానలములు- మహామారుతములు- మహాజాడ్యములు-సంగ్రామములు - విలయసాధనము లగుచున్నవి. విలయము సతతము పునర్నిర్మాణమునకు గారణంబుగ బరిణమించుచున్నది. ప్రపంచప్రవృత్తియందు వృద్ధిక్షయములు దివారాత్రములవలె నవిచ్ఛిన్నముగ సంభవించుచున్నవి. ఆద్యంతములను నిర్ణయించుట దుస్తరము. వృద్ధిపథమునందు క్షయబీజములును క్షయమార్గమునందు నిర్మాణ బీజములును, సుప్రతిష్ఠితములుగ విమర్శకులకు గోచరం బగుచుండును. అహంకారమమకారములు నిజస్వరూపసందర్శనమునకు ప్రతిబంధకములై మహాసమ్మోహమును గలుగజేయుచున్నవి. సకలజీవములకును నిర్మాణ మానందప్రదము. విలయము దుఃఖభాజనము. సంపద లానందదాయకములు. విపత్తులు దుఃఖప్రదములు. మహావిష్ణువు ప్రియంకరుడు. మహాదేవుడు భయంకరుడు. మహాలక్ష్మి సౌమ్యస్వరూపిణి. మహాకాళి ప్రచండ స్వరూపిణి. ప్రకృతివిలాసములం దుభయ భావములును అవ్యవహితముగ బ్రవహించుచు ప్రపంచప్రవృత్తికి మూలబీజము లగుచున్నవి. యోద్ధలకు యుద్ధ మానందమును గలుగజేయును. వర్తకులకు వాణిజ్యము సంతృప్తిని గలుగజేయును. సుఖదుఃఖములకు మూలమైన ప్రకృతిప్రవృత్తి మానవగామ్యమగుచున్నది. లోకము నావరించిన మహామాయ కిదియే మూలబీజము. ధర్మపరిజ్ఞానమున కిదియే పరమసాధనము. స్వాతంత్ర్యప్రాప్తి కిదియే సరియగు మార్గము.

మహా ప్రస్థానమునకు మూలసాధనమైన ప్రకృతివైచిత్ర్యమును నొకక్షణమైనను సంగ్రహించుట యసాధ్యము. ప్రపంచప్రవృత్తియం దొకక్షణమునందు జరిగెడి నాటకమున కాద్యంతములను నిర్ణయించుట యసాధ్యము. లోకమునం దశాంతము సంగ్రామప్రవృత్తి వ్యాపించుచున్నది. వ్యాపారతృష్ణ వర్ధిల్లుచున్నది. రాజ్యాభిలాష పెరుగుచున్నది భాగ్యారాధనాభిలాష వ్యాప్తించుచున్నది. భోగాభిలాష ప్రబలుచున్నది. మహాసంగ్రామము నామమాత్రమున కంతము నొందినను, భావము యథాప్రకారము పెరుగుచున్నది. యూరపు రాజ్యములందు వానినావరించిన మహాతృష్ణ వికీర్ణాకారమును దాల్చుచున్నది. పరాసులు జర్మనులను సాధించుటకు కృతనిశ్చయులై యున్నారు. జర్మనులు వర్సెయిల్సు సంధి నియమముల నతిక్రమించుచున్నారు. మిత్రమండలి సంధి నియమములను బలవంతముగ జర్మనీలమీద ప్రయోగించుటకు సన్నాహములను చేయుచున్నది. లోకమునం దన్ని రాజ్యములందును సంరంభబీజములు వికసించుచున్నవి. అరిష్టప్రదములని నిర్ణయించిన ఇకారాంత వర్ష సప్తకమునందు రౌద్రి సంవత్సరము గతించినది. ఈ సప్తకమునందు గాళయుక్తికి శుక్రుడు రాజు; సిద్ధార్థికి కుజుడు ప్రభువు; రౌద్రికి రవిరాజు; వర్తమాన సంవత్సరమగు దుర్మతికి శనైశ్చరాధీశ్వరుడు. వర్తమాన సంవత్సరఫలమును గణకు లిటులు నిర్దేశించిరి:—

దుర్మతి సంవత్సరమునకు శనైశ్చరుడు రాజు. ఫలము—రాజకోపము, చోరభయము, రోగములు. పురోహితత్వ ఫలము—అర్ఘ్యవృద్ధి, మధ్యసస్యములు, సౌఖ్య

ము. సస్యాధిపతి ఫలము-మందసస్యము, కృష్ణధాన్యాభివృద్ధి, కృష్ణభూమి సాఫల్యము. బుధుడు మంత్రి - ఫలము; మేఘములకు వాయుపీడ. పాపవర్తనము, మధ్యమ ఫలము-గ్రామపాలకులకు:-గ్రామసౌఖ్యము. రాజనీతివర్తనము. కుజుడు సేనాధిపతి-ఫలము - అగ్నిబాధ, దుఃఖము, సంగ్రామము. అర్ఘ్యాధిపతి ఫలము అల్పవృష్టి, అల్పధాన్యము, స్వల్పారోగ్యము. మేఘాధిపతి ఫలము - మహావాయువు, స్వల్పవృష్టి రక్తసస్యాభివృద్ధి; దైవజ్ఞాధిపతి - ఫలము - చోరభయము - అగ్నిభయము - శస్త్రభయము - యుద్ధాభిలాష - దైవజ్ఞులకు మందబుద్ధి. గురువు ధాన్యాధిపతి - ఫలము - సువృష్టి సస్యసమృద్ధి. గోక్షీరాభివృద్ధి. చంద్రుడు రసాధిపతి-ఫలము-తిలతైలగుడ మధుశర్కరాక్షీరాదుల ధరలవృద్ధి. శుక్రుడు నీరసాధిపతి - ఫలము - సుగంధద్రవ్యములకు సువర్ణమునకు ముత్యములకు వస్త్రములకు హెచ్చుధరలు. శుక్రుడు పరీక్షాధిపతి ఫలము - శాకధాన్యాభివృద్ధి. వృక్షజాతుల ఫలాభివృద్ధి. క్షీరాభివృద్ధి. రవి గణికుడు. ఫలము రాజులయుద్ధము. పరస్పర వైరము, వ్యాధిసంకులము. అనర్ఘ్యము. బలరాముడు పశునాయకుడు. ఫలము తృణవృద్ధి. సువృష్టి, మధ్యదేశమునందు సుభిక్షము. వర్తమాన సంవత్సరమునందు శని గురువులకు సింహకన్యారాసులందు సమకాలసంచారము గలదు. ఫలము - క్షుద్భయము శస్త్రభయము. రవి కుజగురు శని రాహువులకు కన్యయందేక కాలమందు కూటమి గలదు. ఫలము రాజపీడామహారిష్టములు. రాజకలహము. ఇతరగ్రహముల స్థితిగతులును ననిష్టములను సూచించుచున్నయవి. సామాన్యఫలము :—

శ్లో. దుర్మత్యబ్దే దుర్మతయో భవం త్యఖిలభూమిపాః
తథాపి సుఖినోలోకా స్సంగ్రామే నిర్జితారయః.

దుర్మతి సంవత్సరమునందు పాపగ్రహములకు రాజాధిపత్యము సైన్యాధిపత్యము సచివాధిపత్యము గలదు. సామాన్యఫలము-సంగ్రామము దుర్భిక్షము కలహము కలవరము. వర్తమాన సంవత్సరమునందు దుర్భిక్షఫలము కఠినమైనను సస్యాదులధరలు తగ్గుననుటకు సూచనలు గలవు. సంగ్రామము సకలదేశముల యార్థికస్థితిని తారుమారు చేసినది. సంగ్రామము జపానుదేశమునకును నమెరికా సంయుక్తరాష్ట్రములకును సంపన్నతను కలుగజేసినను సామాన్యముగ సకలదేశములందును మహాసంక్షోభమును గలుగ జేసినది. పరాజితరాజ్యములందలి ప్రజలన్నాతురులై హాహాకారములను జేయుచున్నారు. సంపదలు లేవు. పదార్థములు లేవు. విజయముఁ బొందిన రాజ్యములు ధనాధిగమనమునకు విశ్వప్రయత్నములను జేయుచున్నవి. ఆశాపిశాచము సంగ్రామాంకురములను నాటుచున్నది. భరతఖండమునకు సంగ్రామలాభములు సంక్రమించకపోయినను సంగ్రామదోషములు సంక్రమించినవి. సంపన్నత క్షీణించినది. వర్తకము స్తంభించినది. దేశాదాయము తగ్గినది. వ్యయము పెరిగినది. దేశాదాయమునందలి సగము భాగము సైనికవ్యయమునకు వినియోగపడుచున్నది. దేశవికాసమున కవసరమైన ధనము మృగ్యముగ నున్నది. ఇట్టి విషమపరిస్థితులు వర్తమాన సంవత్సరమునందు మహాసంక్షోభమునకు సంరంభమునకు సాధనము లగు నని ప్రాజ్ఞులు తలంచుచున్నారు. గాఢాంధకార బంధురమైన వర్తమానాగమనవత్సరముల ప్రవృత్తి భగవదనుగ్రహమువలన విశ్వవికాసమునకు వినియోగపడు గాక!

## సంవత్సరాదిసంచిక

పండ్రెండవ సంవత్సరాది సంచికయందు గత సంచికలయందు వలె విజ్ఞులు వ్రాసిన పద్యములును, వ్యాసములును గలవు. వ్యాసములు ప్రత్యేక శీర్షికలుగ ముద్రితములు. ఇందు రాజకీయ, సారస్వత, సాంఘిక, మత, చారిత్రిక వ్యాసములు వర్తమాన పరిస్థితులకు సంబంధించినవి గలవు. ప్రచురించిన పద్యములందు ప్రజాహృదయము నావరించిన స్వారాజ్య ప్రబోధము ప్రత్యక్షమగుచున్నది. పద్యముల హృదయము ప్రజలయందు గలిగిన నూతన నిరీక్షణమును వ్యక్తముచేయుచున్నది.

గతవత్సరమునందు భారతమాతకు ప్రియపుత్రుడగు లోకమాన్య తిలకుమహారాజు పరమపదమును జేరెను లోకమాన్యుని మరణము భారతభూమిని దుఃఖాంబుధియందు ముంచినది. దేశమునందు దుఃఖానుభవమును వ్యక్తముచేయుచు జేసిన ప్రసంగములు-వ్రాసినవ్యాసములు- చెప్పిన పద్యములు - లోకమాన్యుని యప్రతిమ దేశభక్తిని సాహస ధైర్యములను వ్యక్తము చేయుచున్నవి. ఆధునిక భారతరాజకీయ రంగమునందు స్వారాజ్య సంపాదనమునందు బాలగంగాధరతిలకు చూపిన వజ్రసంకల్పము వారిశత్రువులకు నయిత మాశ్చర్యమును గలిగించినది. లోకమాన్యస్తవమునకు సంబంచిన పద్యములు కొన్ని ముద్రింపబడినవి. శ్రీమాన్

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి యకాల మరణ మాయుర్వేదమునకును నాంధ్రదేశమునకును కొఱతను గలిగించినది ఆయుర్వేదాభివృద్ధికి తమ విద్యావిభవమును సర్వస్వమును సమర్పించి దాని నుద్ధరించిన యాచార్యులవారి నామము చిరస్మరణీయము. వారి గుణగణములను దెలిపెడి పద్యములును కలవు. బ్రహ్మశ్రీ శతావధాని దివాకర్ల తిరుపతిశాస్త్రులుగారాంధ్రవాఙ్మయమునందు ప్రసిద్ధనామమును గడించిరి. శతావధానమునకు ప్రతిష్ఠగల్పించిరి. వారి యకాలమరణము వలన గలిగిన సంతాపమును దెలుపుచు పండితులు వ్రాసినపద్యములును కొన్ని ప్రచురింపబడినవి. ఇతర విషయములకు సంబంధించిన వ్యాసములు పద్యములుగలవు.

## చిత్రపటములు

భారతజాతీయాత్మమూర్తి యగు గాంధిమహాత్ముని రూపభావములు ముఖపటమునకు లక్ష్యములు. మహాత్ముడు-చేతినూలు రాట్నములు స్వరాజ్యయంత్రములని-యనవరతము చేసెడి బోధయే ముఖపటమునందు ప్రదర్శింపబడినది. రాట్నములు-కదురులు-కండెలు-మగ్గములు స్వరాజ్యసంపాదనమునకు భారతీయులకు దివ్యాయుధములు. ఈదివ్యాయుధపరివృతుడై స్వారాజ్యపదవికిని మానవకల్యాణమునకును గాంధిమహాత్ముడు నిష్ఠనుబూని యాత్మసమర్పణమును చేయుచున్నాడు. ఆమహానుభావుని యుపదేశానుసారముగ నాంధ్రప్రపంచము స్వారాజ్యప్రతిష్ఠాపనమునకై సేవావ్రతమును బూని యాత్మసమర్పణమును జేసి స్వధర్మమును నిర్వహించి శివానుగ్రహమునకు పాత్రమగుగాతే. మానవులు భగవద్దత్తములైన కర్మేంద్రియజ్ఞానేంద్రియములను సంపూర్ణముగ వికసింపజేసి మాయావరణమును జయించి సంపూర్ణ యోగసిద్ధిని బడయుదురు గాతే! మంత్రులు అసహాయోద్యమ ప్రచారకులు దేశీయనాయకులు సభాసమావేశములు మొదలగు విషయములకు సంబంధించిన చిత్రపటములు ముద్రింపబడినవి.

దుర్మతిసంవత్సరాది సంచికను జనోపయోగకరముగ సకాలమునకు బ్రచురించుటకు బ్రయత్నించితిమి. దేశభాషాభిమానులు మాయుద్యమసిద్ధికి జేసిన సహాయమునకు వంద్యులు. వ్యాసములను పద్యములను చిత్రపటములను బంపిన మహాజనులకు వందనముల నర్పించుచు ఇందలి గుణములను గ్రహించి లోపములను మన్నించుటకు పాఠకులను వేడుచున్నాము. సంచికా ప్రకాశమునందు అనివార్యముగ గలిగిన కాలయాపనకు మహాశయుల మన్ననలను వేడుచున్నాము.

## భావిసూచనలు

దుర్మతిసంవత్సరము భారతదేశచరిత్రమునందు మిగుల ప్రసిద్ధవత్సరముగ బరిణమించు నని విశ్వసించుటకు ప్రబలములైన నిదర్శనములు గలవు. ప్రజలయందు మహాసంచలన ముదయించినది. ప్రభుత్వ మసహాయోద్యమమును ప్రతిఘటించుటకు తలపడుచున్నది. గాంధిమహాత్ముడాత్మనిగ్రహమును బోధించుచున్నాడు. నవయుగధర్మనిర్మాణమునకు విశ్వమునందంతటను ప్రయత్నములు జరుగుచున్నవి. ఈశ్వరానుగ్రహ మీ ప్రయత్నములు మానవకల్యాణము నొడగూర్చుటకై దోడ్పడుగాక !

## ప్రపంచప్రవృత్తి

ప్రపంచప్రవృత్తియందు గలిగిన మహాసంచలనమును గతించిన సంవత్సరముల వృత్తాంతము వ్యక్తము చేయుచున్నది. మహాసంగ్రామము సంచలనమునకు మూలమైనను-సంగ్రామాంతము శాంతిస్థాపనమును గలుగజేయజాలకుండెను. సకలదేశములందును ప్రజాహృదయము నవయుగ సందర్శనమునకు నిరీక్షించుచున్నది. రాజ్యాంగములందు విద్యా ధన కులీనవర్గాధికారముపోయి ప్రజావర్గాధికారము వ్యాపించుచున్నది. అధికారవర్గమునకును ప్రజావర్గమునకును సకలదేశములందును మహాసంరంభము దినదినప్రవర్ధమానం బగుచున్నది నిరంకుశాధికారముగల దేశములందు ప్రజాధికారము స్థాపిత మగుచున్నది ప్రజాధికారముగల దేశములందు ప్రజాధికారావరణము విశాల మగుచున్నది. పరాధీనములైన రాజ్యములందు స్వారాజ్య సంపాదనాభిలాష వర్ధిల్లుచున్నది. ప్రజలు స్వీయాధికారమును రాజ్యాంగావరణమునందువలె సకలావరణములందును బడయుటకు మహాప్రయత్నములను జేయుచున్నారు. కులాధికారమును ధనాధికారమును విద్యాధికారమును విజాతీయాధికారమును ప్రజలు పూర్ణముగ బ్రతిఘటించుటకు పూనుకొనుచున్నారు. సంగ్రామమునందు ధనార్జనమును జేసిన జపాను అమెరికా సంయుక్త రాష్ట్రములందును, విజయ

కును బడసిన ఫ్రాన్సు బెల్జియము బ్రిటీషుసామ్రాజ్యములందును ప్రతిఘటనబీజములు మహాలయస్వరూపములను దాల్చి పోయినను పరివర్తనస్వరూపమును దాల్చియున్నది. ప్రజాధికారమునకు నిలయమైన యమెరికా సంయుక్తరాష్ట్రములందును, పగను సాధించుటయందు నిరీక్షణముగల ఫ్రాన్సు దేశమునందును పరివర్తనప్రవాహము వెల్లువలై ప్రవహింపకపోయినను, ఇతర రాజ్యములందు ప్రళయవేగమున బ్రవహించుచున్నది. జపానునందు మికాడోమిథ్యను నాశనము చేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. పదేండ్లకు పూర్వము జపానునందు నోగిదంపతులు చక్రవర్తితో సహగమనమును చేసి ప్రపంచమునకు మహాశ్చర్యమును గలుగ జేసిరి. నోగిసేనాధ్యక్షుడు దివ్యమానవునివలె పరమానందమును మికాడోసేవాపారవశ్యానంద మనుభవించుచు ఆత్మసమర్పణమును జేసి దివ్యప్రతిభను గడించెను. ఇపుడు జపానునందు మికాడో మాహాత్మ్యమునందు విశ్వాసము పోవుచున్నది. రాజ్యాంగపరివర్తనమును జేయుటకు జపానురాజ్యమునందు ప్రయత్నములు జరిగినవి. నిరంకుశరాజ్యాధికారాధీనములైన మహాసామ్రాజ్యములు మటుమాయము లైనవి. జర్మనీ ఆస్ట్రియా రుష్యా సామ్రాజ్యములకు సంప్రాప్తమైన పరివర్తన దశాఫలము ప్రాజ్ఞులహృదయములందు వివేకోదయమును గలుగజేయుచున్నది. ఆస్ట్రియాసామ్రాజ్యము నామరూపములు లేక నశించినది. సామ్రాజ్యభాగములు ఇటలీ హంగరీ పోలాండు జగోస్లావియా రుమేనియా మొదలగు దేశములకు సంక్రమించినవి. ఇపు డాస్ట్రియాభాగము 30,000 మైళ్ళ విస్తీర్ణమును 66,00 000 ప్రజలను మాత్రము గలిగియున్నది. ఈ శకలమునందైనను ప్రజ లన్నము లేక పరితపించుచున్నారు. యుద్ధమునకు పూర్వము 1914 సంవత్సరమునందు 2,40,456 మైళ్ల విస్తీర్ణమును 5,80,00 000 ప్రజలను గలిగియున్న మహాసామ్రాజ్యమునకు బట్టిన దుర్దశ సకలసామ్రాజ్యములకు జ్ఞానోపదేశమును జేయజాలియున్నది. మహాసంగ్రామములకు మూలకారకులైన హాప్సుబర్గు రాజవంశజులు రాజ్యభ్రష్టులై భిక్షాటనమును జేయుచున్నారు. ఇటీవల రాజవంశజుడు కారలు మా[illegible] రాజ్యాక్రమణమును జేయుటకు జేసిన ప్రయత్నములు నిష్ఫలములైనవి. సామ్రాజ్యాభిమానులకు నధికారాభిమానులకును గుణపాఠమును నేర్పుటకు హాప్సుబర్గు వంశచరిత్రము ఆస్ట్రియాసామ్రాజ్యచరిత్రము చాలి యున్నది.

### జర్మనుసామ్రాజ్యము

జర్మనుల యహంభావము పరాజయానంతరమునైనను నశింపక పూర్వార్జితాభిమానమే సంక్షోభమునకు కారణంబుగ బరిణమించుచున్నది. లోకసామ్రాజ్యాధిపత్యమునకు కంకణమును గట్టుకొనిన జర్మను సామ్రాజ్య మిప్పుడు మహాదుర్దశ ననుభవించుచున్నది. యుద్ధారంభమునందు స్వస్థలమునందు 2,08,749 పరస్థలములందు 11,34,289 మైళ్ళ విస్తీర్ణమును గలిగి యష్టైశ్వర్యములను ననుభవించుచుండిన జర్మను సామ్రాజ్య మిప్పుడు 208,780 మైళ్ల ప్రదేశమును మాత్రము గలిగి స్వకర్మఫలము ననుభవించుచున్నది. దురాశ దుఃఖములకు చేటను సామెతకు జర్మనుల దురాశాఫలమున దర్థాపత్తి వ్యక్తమగుచున్నది. అవతారపురుషుడనని ప్రగల్భములను బలికిన జర్మను చక్రవర్తి ఇపుడు హాలండునందు దుఃఖితవాసము చేయుచున్నాడు. యుద్ధనష్టపరిహారార్థము నపారమైన ద్రవ్యమును జర్మనీదేశము జయమును బొందిన రాజ్యములకు సమర్పింపవలసి యున్నది. నిరర్థకముగ ఫ్రాన్సునకు గావించిన నష్టపూరణమునకు జర్మనీ తగినశిక్షను బొందనున్నది. సర్వసంహారమునకు బూనుకొనిన జర్మనికి స్వయంకృతాపరాధమున కనురూపమైన ఫలము గలుగుచున్నను పశ్చాత్తాపము గలుగలేదు. అహంకారము జర్మనులను సంధినియమాతిక్రమణమునకు పురికొలుపుచున్నది. జెనీవాయందు మిత్రమండలి రాజ్యములు నిర్ణయించిన యుద్ధఋణముల మొత్తము నిచ్చుటకు జర్మనీ నిరాకరించినది. మిత్రమండలిబలములు జర్మను పట్టణముల నాక్రమించుకొనినవి. సంగ్రామానలము మెల్లగ రగులుచున్నది. అమెరికాసంయుక్త రాష్ట్రములు సంధిసభయందు చేరకపోయినను మధ్యవర్తిత్వమును నిరాకరించినవి. లోకసామ్రాజ్యాధిపత్యమును బడయుటకు ముప్పదేండ్లు విశ్వప్రయత్నములను జేసి యధోగతిపాలైనను దురభిమానమును విడువజాలని జర్మనుదేశవ్యవహారములు సామ్రాజ్యాభిమానులకు గుణపాఠమును నేర్పదగి యున్నవి.

### రుష్యాసామ్రాజ్యము

రుష్యాదేశచరిత్రము ధనాధికారాభిమానులకు

కన్నులను విప్పి జ్ఞానోపదేశమును జేయుచున్నది. నిరంకుశాధికారమునకు పుట్టినిల్లయిన రుష్యారాజ్య మిపుడపరూపమై సంపూర్ణ ప్రజాస్వామ్యత్వము నుస్థాపించుటకు సమకట్టినది. రాజకుటుంబ మంతరించినది. భూస్వాములు మాయమైరి. కుబేరులు కూలిరి. సర్వసమత్వమును స్థాపించుటకు ముఖ్యాధికారులు లెనిను ట్రాట్స్కీగారులు సకలహింసలను జేయుచున్నారు. ప్రజాధికారాచ్ఛాదనమున సోవిటు ప్రభుత్వము చేయుచున్న వధలు నిరంకుశమైన జారుప్రభుత్వ వధలను మీరుచున్నవి. పట్టణములు పాడగుచున్నవి. ప్రజ లన్నము లేక కృశించుచున్నారు. యంత్రయానములు లేక పరిశ్రమలు సంకటలు క్షీణించుచున్నవి. పురములు దుర్భిక్షముపాలగుచున్నవి. గ్రామవాసీయులు మాత్రము విప్లవము పోయి సుఖపడుచున్నటులు వార్తలు తెలుపుచున్నవి. గ్రామములు పాడిపంటలుగలిగి సుఖజీవనమును జేయుచున్నను, నిర్మాణపదార్థములు లేక కష్టపడుచున్నవి. భోగపదార్థముల కభ్యాసమైన నాగరక ప్రపంచమునం దిరువదవ శతాబ్దారంభమునం దేదేశమును పరదేశ సహాయము లేక సుఖజీవనమును గడుపజాలదని రుష్యాదేశానుభవము వ్యక్తముచేసినది. రుష్యనుల పాడిపంటలు - సహజపదార్థములు - యూరపుదేశముల పోషణమున కవసరములు. ఇతరదేశముల నిర్మాణపదార్థములు రుష్యాదేశ పోషణమున కవసరములు. సోవిటు ప్రభుత్వమును ఇతర ప్రభుత్వములును నీసత్యమును గ్రహించుటకు సంగ్రామ మవసరమయినది. ఫ్రాన్సు గ్రేటుబ్రిటను రాజ్యములు సోవిటుబలమును నిర్మూలము చేయుటకు విశ్వప్రయత్నములను జేసినవి. నూతన రాజ్యములను స్థాపించుటకు సైన్యనివహముల నంపినవి. యుద్ధ పరికరముల నందజేసినవి. పెట్టుబడి పెట్టినవి. రుష్యాదేశమునందు నెపోలియనుకు బట్టిన దుర్దశయే మిత్రమండలి యాజ్ఞాపాలకులకును పట్టినది. కాలక్రమమున సోవిటుల బలములు దేశద్రోహుల బలములను నిర్మూలము చేసినవి. డెనికిను కోల్చకు మొదలగు నాయకులు పరారులైరి. యుద్ధమునకు పూర్వము రుష్యాసామ్రాజ్యము 85,00,000 చదరపు మైళ్ల విస్తీర్ణమును 18,30,00,000 ప్రజలను గలిగియుండెను. ఇపుడు రుష్యారాజ్యము 50,00,000 చదరపు మైళ్ల దేశమును 12,00,00,000 ప్రజలను గలిగియుండును. స్వయంనిర్ణయ ధర్మానుసారముగ ఫిన్లాండు, పోలాండు, ఎస్థోనియ, లాట్వియ, లితుయానియ, జార్జియ, ఉక్రెయిను, డాను, కూబను, అజర్బైజను, ఆర్మీనియా రాజ్యములు స్వతంత్ర రాజ్యములుగ నిర్మింపబడెను. ఈ రాజ్యములు రుష్యారాజ్యవిభజనమునకును విస్తీర్ణము తగ్గుటకును గారణమైనను స్వయంనిర్ణయ ధర్మప్రయోగ మవలంబితమై శేషించిన రాజ్యము నేకముఖమునకు తెచ్చుటకు సాధనంబులైనవి. సోవిటురుష్యాతో నమెరికా సంయుక్తరాష్ట్రములు జర్మని పోలాండు లిథుయానియ పారసీకము తుర్కీ అఫ్ఘనిస్థానము మొదలగు దేశములు సంధిని జేసికొనినవి. బ్రిటీషు సామ్రాజ్యము వర్తకసంధిని చేసికొనినది. ఫ్రాన్సు రాజ్యము మాత్రము బిగియబట్టి నిలిచియున్నది. సోవిటు ప్రభుత్వము పారసీకమునకును అఫ్ఘనిస్థానమునకును చిరకాల లబ్ధములైన దేశములను తిరిగి సంక్రమింప జేసినది. పారసీకమునకు బాకీలను సయితము రద్దుచేసినది. మహమ్మదీయ ప్రపంచమును సోవిటుల యుదారప్రవృత్తి యాకర్షించుట సహజము. తురుష్కులకును రుష్యనులకును సంధినిబంధన లేర్పడినటులు వదంతి గలదు. సోవిటుల స్థితిగతులు గతసంవత్సరమునందు యూరపుఖండమునందు స్థిరపడినవి. సోవిటుల ప్రతిభ ప్రపంచశాంతికి వినియోగపడునదియును విప్లవమునకు వినియోగపడునదియును దుర్మతి సంవత్సర వ్యవహారములు నిర్ణయింప గలవు.

సోవిటులు బహుజనాధికారవిధాన స్థాపనమును ప్రకటించుచున్నను, వ్యవహారమునందు ముఖ్యాధికారులు నిరంకుశమార్గము నవలంబించుచున్న విధమును దేశవ్యవహారములు వ్యక్తముచేయుచున్నవి. క్రూరకార్యములును హింసావిధానములును ధర్మసంస్థాపనమునకు సాధనములు గాజాలవు. సోవిటులు ధర్మసంస్థాపనమునకు నిరంకుశప్రభుత్వ మవలంబించిన సాధనల నుపయోగించుచున్నారు గాని ప్రజాభిప్రాయమును గాని ధర్మబలమును గాని యుపయోగించుటలేదు. యూరపు రాజ్యముల కభ్యస్తమైన బాహుబల ప్రయోగమే సోవిటులకును నభ్యాసమగుచున్నది. సోవిటులు వారి ధర్మప్రతిపాదనమును లక్షలకొలది సైనికులమూలమున స్థాపించుచున్నారు. సోవిటుల నిరీక్షణము పాశ్చాత్యుల కభ్యస్తమైన భౌతికలాభముల మీదనే గలదు గాని సకల ధర్మములకును మూలమైన యాధ్యాత్మిక ప్రయోజనములందు లగ్నము గాలేదు. లోకమునందు ధనాధికారదాస్యము నిరంకుశాధికారదాస్యము శిథిల

మైనను ప్రజాశాసనవాస్యము విపరీతాకారమును దాల్చి మహాసంక్షోభమును కలిగించునని యూరపు రాజ్యముల పరిస్థితులు-ముఖ్యముగ రుష్యాదేశ పరిస్థితులు లోకమునకు బోధించుచున్నవి. గాంధిమహాత్ముఁడీయుపద్రవమునుండి భరతవర్షమును గాపాడుట కాధ్యాత్మిక సిద్ధాంతముల ననవరతము బోధించుచున్నాడు. భౌతిక వాసనలందు బడి పొరలుచుండు వారల కాధ్యాత్మిక వాసనలు స్ఫురింపవు. అసురసంపదల ననుభవించెడి వారికి దైవసంపదల ప్రభావ మగమ్యము. గాంధిమహాత్ముఁడు సోవిటుల భౌతికవిప్లవమునుండి భరతవర్షము నుద్ధరించుట కాధ్యాత్మిక బలప్రభావములను సంస్మరింప జేయుచున్నాడు. లోకమునకు మోక్ష మాత్మబలము వలన గలుగగలదు గాని భౌతికాడంబరమున గలుగజాలదు. ఆధ్యాత్మిక ధర్మక్షేత్రమైన భరతఖండమునకు సోవిటుల యుపద్రవము కలుగదని దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి.

## బ్రిటీషుసామ్రాజ్యము

పరమేశ్వరాను గ్రహము బ్రిటీషుసామ్రాజ్యమునకు పరమోచ్చదశను గల్పించినది. బ్రిటీషుసామ్రాజ్యమునకు గల పరపతి - ప్రతిష్ఠ - పలుకుబడి_లోకమునందు వేరొక సామ్రాజ్యమునకు లేదను సిద్ధాంతము నిర్వివాదాంశము. అమెరికా సంయుక్త రాష్ట్రములు కొన్ని విషయములందు బ్రిటీషు ద్వీపముల శుభస్థితిని మించినను బ్రిటీషుద్వీపముల శుభస్థితి యద్వితీయము. బ్రిటీషుద్వీపముల యాదాయము 1918-19 వత్సరము 120,0000,000 వ్యాపారము 200,00,00000 సవరనులు. తలఒకటికి ఆదాయము 26, వ్యాపారము 44 అప్పు 177 సవరనులు. యుద్ధానంతరము బ్రిటీషుద్వీపములకు 800,00,00,000 సవరనుల ఋణము నిలిచినది. అమెరికా సంయుక్తరాష్ట్రముల వ్యాపారము బ్రిటీషుద్వీపముల వ్యాపారమును క్రమముగ దాటుచున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములకు బ్రిటీషుద్వీపములకు గల యప్పులందు మూడవవంతు మాత్రమే గలదు. బ్రిటీషు ద్వీపములకు గల యప్పులందు విశేషభాగ మితర రాజ్యముల పెట్టుబడికై వినియోగింపబడినది. బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగముల రాబడిని సంపదలను బ్రిటీషుద్వీపాదాయసంపదలకు జేర్చినపుడు బ్రిటీషుసామ్రాజ్యశుభస్థితి విశదమగుచున్నది. బ్రిటీషు సామ్రాజ్యము 1,42,72,782 మైళ్లవిస్తీర్ణమును, 44,53,88,500 జనసంఖ్యను గలిగియున్నది. యుద్ధానంతరము 11,00,000 చదరపుమైళ్ళదేశము 1,00,00,000 ప్రజలు బ్రిటీషు సామ్రాజ్యమునకు లభించినవి. సామ్రాజ్య మహావైభవము మాతృదేశమునందును అంతర్భాగములందును పరరాజ్యములందును మత్సరములను గలిగించుచున్నది. భూగోళమునందలి నాల్గవవంతు వైశాల్యమును జనసంఖ్యను గల బ్రిటీషుసామ్రాజ్యమునకు లాభమునకు దగిన భారమును గలదు. ప్రపంచమునందు సుస్థిరశాంతిని స్థాపించుటకు బ్రిటీషుసామ్రాజ్యమునకు గల యవకాశములు ఏయితరసామ్రాజ్యమునకును లేవు. ఇమ్మహాసామ్రాజ్యమునందు మానవపోషణమున కవసరమైన సకల సంపదలును గలవు. సకల మతములును గలవు. సకల సముపాయములును గలవు. ఈ యదృష్టస్థితియే జర్మనుల మాత్సర్యమునకును అమెరికనుల స్పర్థకును గారణము. కాని యాంగ్లేయుల కార్యనిర్వహణ దక్షత్వము వారి నింతవఱ కుద్ధరించినది. సంగ్రామఫలముగ సకల రాజ్యము లందును మహాపరివర్తనము గలిగినది. సకలవ్యవస్థలందును పరివర్తనము గలిగి మానవ జీవితమునందు నూతననిరీక్షణము గలుగుచున్నది.

## నవ నిరీక్షణము

ప్రపంచవ్యాప్తమైన పరివర్తనము మానవహృదయమునందు దాస్యభావవిచ్ఛేదమును జేయుటకు బూనుకొనుచున్నది. కర్మకారులు ధనపాశ బంధనములను ఛేదింపఁ దలపెట్టుచున్నారు. పామరులు విద్యాధికార పాశబంధనమును శిథిలము చేయ యత్నించుచున్నారు. ప్రజలు నిరంకుశాధికార పాశబంధనములను తొలగించుటకు తలపడుచున్నారు. సామాన్యులు కుల పాశబంధములను నిర్మూలము జేయుటకు బూనుకొనుచున్నారు. పరాధీనజాతులు స్వారాజ్యస్థాపనమునకై తపమును జేయుచున్నవి. విశాల సామ్రాజ్యాధిపత్యముగల బ్రిటీషు ద్వీపములకీ కష్టము లన్నియును గలుగుచున్నవి. ఆర్థికసమస్యలు, మతసమస్యలు, వ్యాపారసమస్యలు, అధికారసమస్యలు, స్వాతంత్ర్యసమస్యలు బ్రిటీషు సామ్రాజ్యమునందు ప్రచండవేగమున బరువిడుచున్నవి. బ్రిటీషుద్వీపములందు కార్మికవర్గము నూతనధర్మములను కార్మికుల వేతనములందు స్థాపించుటకు

సమకట్టినవి. బొగ్గుగనుల పనివాండ్రు లాభనష్టములతో నిమిత్తము లేకయే యుద్ధకాలమునందు గల వేతనము ప్రమాణవేతనముగ నుండవలయు నని కోరుచున్నారు. అధికారులు యజమానులు ప్రతిఘటించుచున్నారు. బొగ్గుపనివాండ్రు యానవాహకులు రైలుపనివాండ్రు సమ్మెకట్టి వారి యభీష్టమును పడయగోరుచున్నారు. ప్రభుత్వము సంపూర్ణముగ బ్రతిఘటించుట కేర్పాటులను జేయుచున్నది. కార్మిక ప్రపంచమునందు కార్మికుల విజయము నూతన సిద్ధాంతమును స్థాపించి కార్మికవర్గ విజయమును స్థాపించగలదు. పనివాండ్రు పరిశ్రమాధికారుల లాభనష్టము లెటు లున్నను సుఖజీవనోపాధిని బడయుట కధికారమును గలిగియున్నారని నిర్ధారణ జేయ సమకట్టుచున్నారు. లాభములను పంచుటయును పెట్టుబడికి వడ్డీ నిచ్చుటయును నిర్వహణ ప్రతిఫలమును కర్మకారుల వేతనానంతరము నిర్ణయింపదగిన విషయములు గాని పూర్వము నిర్ణయింపదగిన విషయములు గావని స్థిరపడినయెడల సోవిటుల సిద్ధాంతములు కాలక్రమమున ప్రాపకమును గాంచునని నమ్మవలసి యున్నది. సకల సంస్థాపనలు మానవప్రయోజనమున కేర్పడినవి గాని కేవలము ద్రవ్యోపార్జనమున కేర్పడలే దని స్థిరపడవలసి యున్నది. ఈ ధర్మసంస్థాపనము మహాపరివర్తనమునకు మార్గము నేర్పరచగలదు. కార్మికవర్గమునందు గలిగిన సంచలనము మానవహృదయమునందు గలిగిన సంచలమునకు నిదర్శనముగ నున్నది.

### స్వాతంత్ర్యాభిలాష

కార్మికవర్గము ధనవర్గ పాశబంధవిమోచనమును గోరునటులు పరాధీనజాతులు పరాధీనపాశబంధ విమోచనమును గోరుచున్నవి. ఈజిప్టు చరిత్రము - ఐర్లాండు హత్యలు-భరతవర్షపు భావపరివర్తనము-స్వాతంత్ర్యాభిలాషకు నిదర్శనములు. ఈజిప్టునందు స్త్రీలు స్వాతంత్ర్యసిద్ధి కంతఃపురవాసమును బరిత్యజించి పురుషులతో గలిసి పాటుపడిరి. విద్యార్థులు విద్యాలయములను వదిలి ప్రజాప్రబోధమును గావించిరి. ప్రజలు పరమోత్సాహముతో గష్టముల నెదుర్కొనిరి. నాయకులు కారాగృహవాసములను స్వర్గవాసమువలె స్వీకరించిరి. బ్రిటీషు ప్రభుత్వము నూరేండ్లనుండియును ఈజిప్టునకు స్వాతంత్ర్యమును ప్రసాదించుటకు వాగ్దానములను జేయుచుండెను. కాని ఏదో యొక కారణ మడ్డుపడి వాగ్దానభంగము గలుగుచుండెను. పరమోదారస్వభావమును గలిగిన గ్లాడుస్టోను మంత్రియును స్థిరనిర్ణయములను మార్చజాలకపోయెను. యుద్ధసమయమునందు సంగ్రామావసరములకుగాను ఈజిప్టు సంరక్షకదేశముగ నిరూపింపబడినది. యుద్ధానంతరము గ్రేటుబ్రిటను రాజ్యబంధనములను బిగించినదే గాని సడలింపలేదు. ఐగుప్తులందు గలిగిన యావేశమును శాంతింప జేయుటకు మిల్నరుపంచాయతీసభ నియమింపబడినది. మిల్నరు ప్రభువు మోంటేగు చెమ్సఫర్డు లవలంబించిన సంకుచితమార్గము నవలంబింపక దీర్ఘదృష్టితో సంపూర్ణస్వరాజ్యస్థాపనము నాదేశించెను. అధికారదేవతల కీమార్గము వెగటుగ నుండెను. చర్చిలు ప్రభృతులు స్వరాజ్యప్రదానమును ప్రతిఘటించిరి. ఆందోళనము ప్రబలినది. ఈజిప్టునందు చర్చిలుగారికి పరాభవము గలిగినది. ఇపుడు జగ్లులుపాషా గారు స్వరాజ్యస్థాపనాశయములతో వ్యవహారనిర్వహణమునకు బూనుకొనుచున్నారు. పర్యవసాన మనతికాలముననే వ్యక్తము గాగలదు. ఆంగ్లరాజనీతిజ్ఞుల సంకుచితస్వభావమును ఈజిప్టుదేశ వ్యవహారములు విశదము చేయుచున్నవి.

### ఐర్లాండు

ఐర్లాండుదేశ మిపుడు స్వరాజ్యప్రాప్తికి మహావేదన ననుభవించుచున్నది. సిన్ఫీనరుల బలము శుక్లపక్షచంద్రునివలె దినదినాభివృద్ధిని బొందుచున్నది. సిన్ఫీనరులు మూడువంతుల భాగములందు బ్రిటీషు ప్రభుత్వాధికారమును ప్రతిఘటించుచు స్వీయాధికారమును సాగించుచున్నారు. ప్రతికూలమైన అల్స్టరు భాగమునందు నయితము సిన్ఫీనరుల యధికారము వ్యాపించుచున్నది. సిన్ఫీనరులు లోకమునకు స్వతంత్రరాజ్యస్థాపనమును బ్రకటించుచున్నారు. స్వాతంత్ర్యమునకై సిన్ఫీనరులు జేయుచున్న హత్యలు దుర్ణయములు దౌర్జన్యకార్యములు పరమ విచారమును గలిగించుచున్నవి. గతసంవత్సరమునందు 2000 హత్యలు 20,000 దుర్ణయకార్యములు జరిగినవి. పరిపాలన విధానము యథార్థముగ సిన్ఫీనరుల హస్తగతమైనది. పురపాలన సంఘములు మండలసంఘములు సిన్ఫీనరుల హస్తగతములైనవి. వారు పన్నులను తీసికొనుచున్నారు. న్యాయవిమర్శనమును చేయుచున్నారు. దురంతకముల నొన

తత్తులోహే పరీక్షిపేత్ ।తద్ధూమోదంత లగ్నశ్చేత్కటావా సాంపత వంపరమ్. ఈ వల్లభాచార్యుఁ డొక్క భిషక్ఛిఖామణియే కాక సరస కవిశిఖామణి యనియుఁ దెలియుచున్నది. ఈతని కవిత్వ గుంభనల కీ క్రిందిరచనలు సాక్ష్యమీయఁగలుగును:—శ్లో. ఫలత్రయం కటుత్రయం సురోజజయే ద్భిషగ్వర। త్రిజాతకం యవాని యుగ్మ వహ్నిజీరకం తథా। రాస్నభాగ్గవహ్నిచ వ్యథాన్వయుగ్మ జీరకం అశ్వగంధ సంయుతం పృథక్చకర్ష సంయుతం। మధుస్నేహేచ తత్సమా సశర్కరాసమాక్షికం। గోఘృతం సుపక్వకం రసాయనం మనోహరం। మేహపిత్తవాతకుష్ఠ గుల్మశూలహారకం। సప్తధాతు వర్ధనం సుదీపనం యశస్కరం। పూజ్యపాదనిర్మితం రసాయనం సుపూజితమ్॥

బసవరాజీయము:—ఆంధ్రాయుర్వేద గ్రంథములలో "చింతామణి" తరువాత నిదియే యుత్తమగ్రంథము. ఆంధ్రభిషజులలో దీనిని జదువనివా రుండరు. ఈ గ్రంథమునకు రచయిత నీలకంఠ కొట్టూరు బసవరాజు. ఈయనతండ్రి నమశ్శివాయ గురువు. ఆరాధ్య రామదేశికుడు. స్వనామ గురునామాదులను బట్టికాని ప్రకరణాంతమున నీతడు చేయు ప్రార్థనలఁ బట్టిగాని చూచినచో నీతండు శైవుం డని తోచును. అనుకర్త్రను కార్యాలను ఏర్పఱచ వీలు లేదు. కాని యీతఁడు చింతామణిలోని విషయంబుల ననేకము తన గ్రంథమున జేర్చినాడందురు. కలౌ బసవక స్మృతిః, కలౌ చింతామణిస్మృతిః వచనములు సంశయము నొదవించుటకు మాత్రమే చాలియున్నవి. ఈయన "కవితాచాతురీ ధురీణుఁ"డ నని వ్రాసికొన్నను కవిత అంత సరసముగా నుండలేదు. కాని "వైద్యజనశిరోభూషణ" యను బిరుదమును జాలవఱకు సార్థకము జేసికొన్నాఁడు. వల్లభాచార్యుని కాలముకంటె నీతని కాలంబున నాంధ్రాయుర్వేదము కొంచె మభివృద్ధి గాంచిన దనవచ్చును. అనేక గ్రంథములం జూచి అందలి సారంబును గ్రహించి తా నీ గ్రంథమును జేయుచున్నాను అని వ్రాసిన మాట కుపబలముగాఁ గాబోలును ముద్రితమైన బసవరాజీయములో ఆయా విషయములకు మొదట చరకే మాధవనిదానే అను నీ మున్నగు పదము లుట్టంకితములు. కాని చరకసంహితలో రసగంధకాదియోగములును మాధవనిదానమున చికిత్సావిషయంబులును నెచ్చట నున్నవో విమర్శింపవలయును. ఇప్పుడు లభించు చరకాది గ్రంథములలో లేవు.

వల్లభాచార్యునికంటెను బసవరాజీయమునఁ జేర్చిన గొన్ని నూతనయోగములు:— (1) కర్పూరిని బసవరాజు పురాణజ్వరముల యందు బ్రధానముగా నుపయోగించుట (2) అగ్నిమాంద్యమున విషముష్టిని ప్రయోగించుట (3) ఉబ్బసమున బలురక్కసిని బ్రయోగించుట (4) ప్రమేహమును వేపబంకను ప్రయోగించుట (5) మూలరోగమున అక్కలకఱ్ఱ నుపయోగించుట (6) ప్రతిశ్యాయరోగమున నవాసారము నుపయోగించుట (7) యోనిశూలలలో మయూరతుత్థ ప్రయోగము (8) ఉన్మాద రోగములలో పంది చెవిలోని రక్తముచే నస్యకర్మఁ జేయించుట (9) వ్రణము పగులుటకు నరాస్థిని తైలముతో లేపనము జేయుటతో (10) కోఁడి గ్రుడ్డునందు రసమును దీసివైచి ఔషధద్రవ్యమునుంచి వాలుకాయంత్రమునఁ బచనముచేయుట. (11) వంధ్యారోగమందు మహాద్రాక్షాదియోగములు (12) హృద్రోగమున గురివెంద విత్తుల నుపయోగించుట (13) పాండురోగమున నల్లఉప్పిచెక్కను విశేషముగాఁ బ్రయోగించుట (14) ఉబ్బసంబున చేఁదుబీఱవిత్తులను బ్రయోగించుట ఇట్లనేకములు గలవు. వాతరోగములలో వల్లభాచార్యుడు గ్రహింపని యాయుర్వేదసూత్రములను అగ్నికర్మనుఁ దనగ్రంథమున ఈయనఁ జేర్చికొన్నాడు. మొత్తముపైని నాంధ్రాయుర్వేదాభివృద్ధి వల్లభాచార్యుని కాలమునందుకంటెను ఈ బసవరాజుకాలమునందు నెక్కుడు అభివృద్ధి నొందె ననవచ్చును.

భేషజకల్పము:—ఇయ్యది పరిభాషాత్మక గ్రంథము. చందనాచార్యపుత్రుఁ డగు గంగాధరాచార్యునిచే సంగ్రహింపఁబడినది. దీనిని చిలకమర్తి వేంకటాచార్యుఁడు ఆంధ్రమున పద్యరూపముగా నొనర్చినాడు. ఈతఁడు శరణ్యపాదాచార్యునికొమరుఁడు. ఈయన గురువు కందాళ రంగాచార్యుఁడు. ఇం దెన్నియో పరిభాషలు గలవు. మాన విషయంబైన మతభేదము లిందుఁ జక్కఁగా విభజింపఁబడియున్నవి. తత్తత్ప్రక్రియల నుపయోగించు కషాయభేదము లెన్నియో చక్కఁగా వివరింపఁబడినవి.

ఇట్టిగ్రంథ మింతదనుక వ్రాయసకాండ్రమూలమున దోషభూయిష్ఠంబై యున్నది. దీనిని కీ. శే. వైద్యరత్న ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి పండిత డి. గోపాలాచార్యుల వారు అనేక గ్రంథముల సహాయ్యమున స్వోపజ్ఞ మగు నాంధ్రవ్యాఖ్యానముతో ముద్రించి పుణ్యము గట్టికొని మనలఁ దరింపఁజేసినారు.

ఆంధ్రచింతామణి:—దేవులపల్లి వెంకటనరసయ్య ఈ గ్రంథమునకు ప్రణేత. శ్రీనివాసమంత్రి ఈయన పితామహుఁడు. ప్రారంభపద్యములవలన నద్వైతమతస్థుం డని తెలియుచున్నది. ఆశ్వాసాంత గద్యమువలన ప్రధానముగా వైష్ణవభక్తుఁ డని తేలును. ఈయన వ్రాసికొనిన గద్యను బట్టి వల్లభాచార్య విరచితంబగు వైద్యచింతామణి కిది యొకవిధ మగు ననుకృతి యని స్పష్ట మగును. ఈ భాషాంతరీకరణమును బట్టి చూచినచో గొంత వ్యత్యాసము చూపట్టుచున్నది. లక్ష్యానుసారంబుగ నితడు ప్రథమాశ్వాసంబుననే లోహపాషాణశోధనమారణాదిక్రియలను జెప్పియున్నాడు. ఇప్పుడు ముద్రితమైన చింతామణియందు నీ ప్రకరణము తుట్టతుదను గాన్పించుచున్నది. ఇం దెయ్యది సత్యమో యూహింప వలనుపడలేదు. ఎట్లయినను నితండు పూర్ణంబుగా జింతామణిని భాషాంతరీకరించినట్లు తోఁచెడిని. కాని పొత్తమంతయు లభించుట లేదు.

శరభరాజీయము:— ఈ గ్రంథమునకుఁ గర్త శివదేవుల శరభరాజు. ఈతని కాలము గాని జన్మస్థలము గాని తెలియఁజేయు నాధారంబులు గానరావు. ఇందు బసవరాజీయము వైద్యచింతామణి మున్నగు వానిలోని యోగములు గానఁబడుటచేత తదనంతర కాలికత్వము మాత్రము సిద్ధించుచున్నది.

# ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్

## అనుమతిబొందిన మూలధనము రూ. 3,00,000.

వాటా. (షేరు) ఒక్కటికి రు. 10 చొప్పున 30 వేల షేర్లుగా విభజింపబడినవి.

ఇదివరకు 15,000 వాటాలకు దరఖాస్తులు వచ్చియున్నవి.

ఏఁబదివేలరూపాయలకు మించి వసూలైయున్నవి.

పనులు బాగుగా జరుగుచున్నవి. ఆర్డర్లు అపరిమితముగా వచ్చుచున్నవి.

రూ. 1,50,000 ల వాటాలు ప్రస్తుతము అమ్మకమునకు సిద్ధముగా నున్నవి.

1922 సం॥రం జనవరినెల మొదటితేది లోపల మంజూరు చేయబడును.

ప్రాస్పెక్టసు, వాటా దరఖాస్తుఫారములు, వాటాలను కన్వాసుచేయుటకు ఏజన్సీ నిబంధనలు, మున్నగువాటికి తక్షణమే ఈక్రిఁది విలాసమునకు వ్రాయవలెను.

కార్యదర్శి,
ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్



19, హారిస్‌రోడ్డు, మౌంటురోడ్డు,
మద్రాసు.

ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్‌వారిచే నిర్దుష్టముగా తయారుచేయబడిన శాస్త్రీయ ఔషధములు.

ముఖ్య గమనింపు:—ఒక వాటాకు దరఖాస్తులు పంపినను, రిజిస్టరుచేయబడును. ఆయుర్వేదమును వృద్ధిజేయుటకు ప్రోత్సాహము నొసగునట్టివారి కిది మంచిసమయము.

### త్రివృత్ లేహ్యము.

4 అవున్సులు 1 రూపాయి; ఒకపౌను రూ 3 లు.

శ్లో. త్రివృన్మూలం విరేచనే... చరకసంహిత, (కల్పస్థానం)

దీనిని మోతాదుప్రకారము పుచ్చుకొనిన, సుఖవిరేచనమగును. బాలురు, వృద్ధులు, గర్భిణిస్త్రీలు గూడ పుచ్చుకొనదగును. తియ్యగా, రుచిగా నుండును. నిరపాయమైనది. అగ్నిమాంద్యమును బోగొట్టి బలము నిచ్చును.

### స్తన్యవర్ధక చూర్ణము.

4 అవున్సులు రు 0-8-0, 1 పౌను రు 1-8-0.

శ్లో॥ స్తన్యదంవృష్యంస్నిగ్ధం...(ద్రవ్యగుణసంగ్రహం)

ఇది చనుబాలులేని తల్లులు విధ్యుక్తముగా పుచ్చుకొనిన మిక్కుటముగా పాలు, చేపరచ్చును. బిడ్డలకు పోతపాలుగాని, మరేవిధమైన ఆహారముగాని ఇచ్చుటకంటె తల్లులీచూర్ణమును సేవించుట మంచిది.

# డాక్టరు ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి. సి. ఎం. గారిచే స్థాపింపబడిన

## ఆంధ్ర ఆయుర్వేద ఫార్మసీ లిమిటెడ్ వారిచే నిర్దుష్టముగా తయారుచేయబడిన శాస్త్రీయ ఔషధములు.

తాళీసాదిమోదకము-వటికలు
ఒక తులము. మోదకము 10 తులములు 8 అణాలు
వటికలు 100 ఒకరూపాయి. 1000-కి 7-8-0.
శ్లో. కాసశ్వాస జ్వరఘ్నం ఛర్ది పీనస నాశనం। శ్లో
అగ్నిసందీపనం శ్రేష్ఠం పాండురోగఘ్నం. శా॥సంహిత



కఫ ఎక్కువయి దగ్గు జలుబు మొదలగు వ్యాధులయందు
మిక్కిలి ఉపయోగము. నాలుకకు అతిరుచిని కలిగించును
ను. అరుచి పోగొట్టి ఆకలి పుట్టించును. క్షయ,
పాండురోగములయందు కూడ ఉపయోగము కలదు.

### ఇచ్ఛాభేదివటి

తులము 0-10-0 అణాలు; 10 తులములు రూ 5-0-0

మాత్రలు 100-కి 8 అణాలు; 1000-కి రూ 4.

ఇది సుఖవిరేచనము చేయును. జ్వరములోను గూడ నిచ్చిన విరేచనమై జ్వరము తగ్గును. రాత్రి పరుండబోవునపుడు తీసికొనిన ఉదయమున విరేచన మగును.

### చందనాది వటి.

25 మాత్రలు 1 రూపాయి.

ఈమాత్రలు ప్రమేహము, ఔపసర్గిక మేహము (పచ్చసెగ), మూత్రకృచ్ఛ్రము, మూత్రనాళము సంకుచితము, మూత్రాశయ బలహీనత, స్త్రీలకువచ్చే పసుపురోగములు, మొదలగు వ్యాధులను పోగొట్టును. గనేరియాకు ప్రశస్తమైన మందు.

### అశ్వగంధాది లేహ్యము.

4 అవున్సులు 1 రూపాయి; ఒకపౌను రూ. 3

శ్లో. క్షీణక్షీణేచ దేహేచ విశేషబలవర్ధనం...వనా॥

ఇది క్షీణించిన శరీరము గలవారలకు బలము, పుష్టి, జఠరదీప్తిని గలిగించును. మరియు నవీనముగా వచ్చినది, లేక చిరకాలము నుంచి యున్న ఫిరంగిరోగమును బాగుచేయును. వాతరోగము, ఆమవాతనొప్పులు, కీళ్లనొప్పులను పోగొట్టి నరములకు బలము చేయును. ధాతువృద్ధిని గలిగించును. మేధాజనకము.

### దంతధావన చూర్ణము.

అవున్సు 0-4-0; 2 అవున్సులు 0-7-0.

దీనితో పళ్లు తోముకొనిన, పుచిగాను, దుర్గంధ రహితముగా నుండును. ఇది స్వాదుగాను కటు, కషాయరస ప్రధానముగాను ఉండును. పళ్లు వెంబడిని చీము, రక్తముపడుట, పళ్లు కదలుట, మాటిమాటికి ఇగుళ్లు ఉబ్బుట మొదలగు దంతరోగములను పోగొట్టును. నోటిదుర్వాసన గంధరహితముగా కూడ నుపయోగి పడగును.

### వాసావలేహ్యము.

(బసవ, కఫరోగాది వారకము)

"...శ్వాసనేచకాసేక్షయే రక్తపిత్తేకఫపీనసేచ......"

ఈ లేహ్యము దగ్గు, ఎగశ్వాస, ఉబ్బసము, నోటివెంట రక్తముపడుట, క్షయ మొదలగు వ్యాధులయందు మిక్కిలి ఉపయోగపడును. 4 అవున్సులు రూ 1-4-0; 1 పౌను రూ 4.

వాసాచూర్ణము: ఈ చూర్ణమును నిప్పుమీదవేసి పొగను పీల్చినయెడల శ్వాసము, ఎగఊపిరి వెంటనే తగ్గును. రోగికి ఆయాసము హెచ్చుగ ఉండునపుడు పై వాసావలేహమును లోపలి కిచ్చుచు ఈ చూర్ణముతో ధూమపానముచేయించుట హితము.

వెల 1 అవున్సు రూ 0-12-0.

పోస్టుబాక్సు 369. ఆంధ్ర ఆయుర్వేదఫార్మసీ లిమిటెడ్, 19 హారిస్ రోడ్డు, మౌంటురోడ్డు-మద్రాసు.

రసప్రదీపిక:—ఇయ్యది మూఁడాశ్వాసముల గ్రంథము. దీనిని ముమ్మంబి వేంకటాచార్యుడు సంస్కృతమునుండి యాంధ్రమున పద్యరూపముగా నొనర్చినాడు. కీ. శే. వీరేశలింగముపంతులుగారు కవిచరిత్రమున నీతడు నూఱువత్సరముల లోఁబడినవాఁడనియు గోదావరి మండలవాసి యనియును వ్రాసినారు. రసప్రదీపిక యాంధ్రభాషలోని రాసాయనిక గ్రంథములలో తొలుదొల్తది. ఇందు ధాతు లోహ మారణాది విషయంబు లన్నియు వర్ణింపఁబడి యున్నవి. ప్రాచీన రసతంత్ర ప్రవర్తకులు పారదము రసరసేంద్ర సూత, పారద, మిశ్రకభేదములచే నైదు విధము లనియు నందు రస రసేంద్రములు బుద్ధైడి రూపములు దేవనాగులు పూర్వులు రనియు దానంజేసి యయ్యవి దుర్లభంబు లనియు మిగిలిన సూత మిశ్ర పారదంబులు లభ్యంబు లనియు వ్రాసియుండగా నీ కవి తనకాలమునకు ఆముూటిలో గూడ రెండు దుర్లభంబు లగుటవలన పారదము మాత్రమే లభ్య మగు నన్నాడు. ఈ రసప్రదీపికకును కీ. శే. గోపాలాచార్యులుగారు ప్రభ యను వ్యాఖ్యానము తెలుగున వ్రాసి ప్రకటించినారు. ఈ రసప్రదీపికయు నీవ్యాఖ్యానమును నాంధ్రదేశమందలి రాసాయనిక గ్రంథదారిద్ర్యమును తొలగించిన వనియే చెప్పవచ్చును.

నవనాథసిద్ధప్రదీపిక:—గ్రంథకర్త ఇర్లపాటి పేరయామాత్యుఁడు. వైద్యసార మని గూడ దీనికి మఱొక నామము గలదు. ఇయ్యది యసంపూర్ణమగుటచే గ్రంథము నంతగా విమర్శింప వీలు లేదు.

ఈ విషయమును గూర్చి యంతగా విమర్శింప నవసరము లేదు. ఈ గ్రంథములలో జాలభాగము ముద్రితంబులై మనకు దొరకుచునే యున్నవి. కావున ముద్రణలో లేక యాంధ్రవ్యాఖ్యతో గూడియున్న యొకటిరెండు గ్రంథములను మాత్రము వివరించెదను.

గదా సంజీవనము:—ఇది సంస్కృతంబున శ్రీవత్సగోత్రుండును ఆపస్తంబసూత్రుండు నగు మాధవపండితునిచే రచింపఁబడినది. ఈతనికి వైద్యవిద్యా త్రినేత్ర యను బిరుదమున్నది. ఈ గ్రంథమునకు యాంధ్రటీక నెవ్వ రెప్పుడు రచించిరో తెలియదు. ఇందు రోగ నిదానంబులు లక్షణంబులు తచ్చికిత్సలును చక్కఁగా వివరింపఁబడినవి. కాని ఇయ్యది యసంపూర్ణముగా లభించుటచే నంతగా విమర్శింప వీలుపడుటలేదు. శైలికొక శ్లోకము:—

శ్లో. కుండలీపత్రమరిచం శృంగీశృంగంచ నాగరమ్
　లశునం భృంగరాజశ్చ క్వాథోయం సర్వశూలజిత్.

బాహటము:— ఇందలి "గౌరీపుత్రకార్తికేయ విరచితే బాహట గ్రంథేని దానగణ రోగోనామ ప్రథమః పరిచ్ఛేదః." అను గద్యమును పరిశీలించినచో నష్టాంగహృదయము కాక ఇదియొక నూతనగ్రంథమని స్ఫురించుచున్నది. కాని నిజమునకు దీని నెవ్వరు రచించిరో తెలియరాదు. యిందు చరక వాగ్భటాదులలోని నిదానంబులు చికిత్సలు నానుపూర్విగ గలవు. ఇయ్యది రెండు పరిచ్ఛేదములు మాత్రము లభించుచున్నది. ఇవిగాక మద్రాసులో నివసించిన పువ్వాడవారు ఈక్రింది గ్రంథములకు చక్కని టీకలను వ్రాసి ప్రకటించినారు:— (1) అష్టాంగహృదయము (2) అనుపానతత్వాకరము (3) కాలవిజ్ఞానము (4) గుణపాఠము (5) ధన్వంతరంగము (6) చికిత్సారత్నము (7) చికిత్సాసారము (8) ధన్వంతరినిఘంటువు (9) నాడీనక్షత్రమాల (10) నాడీజ్ఞానము (11) నాడీకరణకల్పద్రుమము (12) శార్ఙ్గధరసంహిత (13) సర్వౌషధిగుణకల్పము (14) సుశ్రుతశారీరము (15) వైద్యామృతము (16) సద్వైద్యజీవనము (17) అనుపానమంజరి. ఇట్టులనే మొనమొన్న కీర్తిశేషులైన పండిత గోపాలాచార్యులు వారును ఈక్రింది గ్రంథములను చక్కని వ్యాఖ్యానములతో ముద్రించి ఆంధ్రదేశసేవఁ జేసి మనలఁ బరిణమ జేసినారు. (1) మాధవనిదానము (2) అర్కప్రకాశము (3) ఆయుర్వేదపరిభాష (4) పథ్యాపథ్యము. ఇవి కాక శ్రీ ఆచార్యులువారు టీకలు వ్రాసిన పెక్కు గ్రంథము లున్నవి. ఈ వ్రాసిన దానింబట్టి మన యాంధ్రదేశమునఁ గొంతవఱకు గల ఆయుర్వేద గ్రంథములు స్థితి తెలిసినది. ఇంకను నధికముగా గ్రంథము లుండినవని చెప్పవలసియున్నది. కాని అట్టివి వెలువడకుండుట నిజముగా మన యాలసత్వమునకు ఫలమనక తప్పదు. ఇప్పటి మన స్థితిగతు లెంత నీచముగా నున్నను, పూర్వులగు మన యాంధ్రులు ఆయుర్వేదమున మిగుల పరిశ్రమచేసి సుచికిత్సకులై గౌరవపాత్రులై రని ఆనిశల్ల శాసనమే వేయినోళ్ల చాటుచున్నది. మఱియు నిప్పుడు గూడ గ్వాలియర్ బరోడా రీవా దర్భంగ కొచ్చి మైసూరు మొదలగు సంస్థానాధీశు లిదివఱకే యాయుర్వేదమునకుఁ బ్రోత్సాహ మొసఁగుచున్నారు. కొందఱు మునిసిపల్ సంఘముల వారును తాలూకాబోర్డు జిల్లాబోర్డులవారును యాయుర్వేదముపట్ల సభిమానముఁ జూపుచున్నారు. ఇట్లే మనయాంధ్రదేశములోని సంస్థానాధీశులును శ్రీమంతులును రాజ్యతంత్రాధికారులును ఈ యాయుర్వేదమునకు చేయూత నొసంగినచో ఆంధ్రభాషాదేవికి అమూల్యాభరణము లనఁదగిన గ్రంథరత్నలును బయలు వెడలఁ గల్గుదురు. దాన మనకు చిరత రారోగ్యభాగ్యములు చేకూరి సమృద్ధులు నిండారగలవు. కావున సర్వేశ్వరుఁడు మనయాంధ్రదేశమున కిట్టి భాగ్యమును ప్రసాదించును గాక.

# లోకయాత్ర

మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి గారు

లోకము భిన్నభావము విలుప్తము బుద్ధియు బల్మికల్మి, దు
ర్ధీకులు మాయలందుఁగడ తేఱినస్వాములు పెక్కుమంది, సు
శ్లోకులు ధర్మతత్పరులుఁ జూడఁగఁ దక్కువ. ఏమిదారి? యా
హా! కలికాలసాధు లపహాస్యతపా లగుచుండి రెంతయున్.

ఉ. తోఁచును మంచి చెడ్డయై, తోఁచును చెడ్డయు మంచియౌచు, నా
లోచన లెస్సగా సలిపి లోకహితం బగు దాని నెట్టులో
యాచరణంబునం దిడుట యందరికిన్ విధి, స్వీయపక్షమున్
జూచిన లాభముండెడి ననూయను వీడుట శ్రేయ మెంతయున్.

చ. ఒకరి సుఖంబుసున్ సుఖమె? యొక్కరి దుఃఖము దుఃఖమే? జగ
మ్మొకపగిదిన్ సుఖించుగతి యోజనచేసెడి బుద్ధిమంతు లె
న్నిక గను కాల మియ్యది. యనింద్యచరిత్రులె రాజు లెల్ల. నిం
దకుఁ దగు కర్జముల్ సలుప దార్కొన రెన్నడు భూమిపాలకుల్.

మ. మన మేరీతి మెలంగినన్ జగము నమ్మాడ్కిన్ బ్రవర్తిల్లు. స
జ్జనుఁ డేవేళ బరోపకారపరుఁడై సన్మాన్యుఁడై యొప్పు. దు
ర్జనుఁడే వో యపకారముల్ సలిపి సర్వద్వేషియౌ. లోకరం
జనుఁ డెవ్వండో యతండె రాజగును. రాజద్వేషి కీడం దడిన్.

శా. ఎంచం జెల్లదు దోషులంచు నొరులన్, హేయంబులే వేని వ
ర్జించం జెల్లు, బరోపకారులను దూషించంగ రాదెప్డు బా
ధించం గూడదు సాధుమానవుల యత్నించంగ నా కీర్తికిం
గించిత్తేని వివేక మున్న నరుఁడేన్ గీడొందుఁ గా నెంచినన్.

శా. ఊనం బిద్ది యనూన మియ్యది మహాంహోదారుణం బిద్ది ని
త్యానందం బిది పుణ్య మియ్యది యటం చావంత యోజించ నా
డేనాఁడేని యొనర్చినన్ జగతికా నింతేని మేల్ తాదృశ
జ్ఞానంబు న్విడి చేసినట్టి పని ప్రాజ్ఞశ్లాఘ్య మెట్లయ్యెడిన్?

చ. ఎవరికి నేది యుక్తమొ యదే శుభదం బగు వారి కెప్డు. శాం
భవ మని శాక్తమంచు మరి వైష్ణవ మంచును సౌర మంచుఁ గ్రై
స్తవ మని తౌరుష్కం బనియు ధాత్రిఁ గట్టి మతమ్ము లెల్ల నుం
చివియ. యుపాసకప్రకృతి చెడ్డదియే నది చెడ్డ దయ్యెడిన్.

సీ. కామధేనువుఁ గొన్న కార్తవీర్యునిఁ దండ్రి
గూర్చినయతని గొడ్డుకలను దున్మి
అవనిఁ బరశురాముఁ డక్షత్రియను జేసి
ధాత్రీసురుల కిది దారవోసె
మును కశ్యపుని దిది యను విషయము బోధ
పడు కాశ్యపీపదముఁ గనిన
బ్రాహ్మంబు కన్న క్షాత్త్రం బూన మగు తేజ
మని తెల్పెఁ గుశికనందనమహర్షి.

తే. యిప్పటికిఁ బ్రభువులు బ్రాహ్మణేతరులకు
గౌరవము గూర్పఁగడఁగుట కరము బ్రాహ్మ
మెక్కు డని తెల్పునట్టిది యొట్టు లడుగు
పట్టుఁబట్టదు పట్టదెప్పటికి నిజము.

తే. అప్పు డారీతి బ్రాహ్మణు లవనిపు లయి
దాని క్షత్త్రియులకు నిడి తపముఁ బూని
మంత్రులయి కీర్తిఁ గని కలిమహిమ సేవ
కత్వమునకును దగమండ్రి కడకు నకట.

తే. కలిమహిమ యిప్పు డంతగాఁ గానిపించ
కున్న నింతయో యంతయో యున్న దిపుడు
బ్రాహ్మణులకు నస్వార్థపర ప్రవృత్తి
దాని విడకున్న వారి కెంతేని మేలు.

సీ. వృత్రాసురుని జంపవేడిన మఘవ సాగరముఁ
ద్రావడె మున్నగస్త్యమౌని
మును దధీచియనెడి ముని యీడె తన
యెమ్ము లర్థులై వచ్చిన యనిమిషులకు
వనకడ కరువెంచు తపసులఁ బ్రోచి గోదా
వరిన్ దెడె గౌతమమహర్షి
ఇక నెంద రెందఱో బుధు లుపకారముల్
చేసి లోకములఁ బ్రసిద్ధిఁ గనరె.

తే. అట్లె జగదుపకారమ్ము నాచరించి
బ్రహ్మకులజులు తమ గౌరవంబు నిల్పు
కొనఁగవలె. వారి ద్వేషింపఁగూడ దెవరు
బ్రాహ్మణద్వేషమున నేగి రచ్చసంద్రు.

తే. మొంపటినుండియు నన్యుల మోసపుచ్చి
యణఁగఁద్రొక్కిరి బ్రాహ్మణు లనుచు గొంద
అంద్రు; నూతు రెవ్వరో వారి నఖిలమునులు
గౌరవించుటఁ గనరో యవ్వారలెపుడు.

తే. అతఁడు మునులకు నడిపిన యవియ కద పు
రాణములు నేటికిని వాని బ్రాహ్మణులు ని
రాకరించిరె? యోగ్యులు గాక యొవరు
గౌరవముఁ జెంద జాలరు గా ధరిత్రి.

తే. ఎవని దేజాతి యేఁ గాని, యేమతంబు
గాని, యన్యోన్యసరాగంబు గలిగి మెలఁగ
వలయు, నట్లైన శుభములుఁ గలిగి తీఱుఁ
గాన నెరికిఁ గూడదు కలహపడుట.

తే. అరయ నాచారముల కప్పుడపుడు మార్పు
లగుపడెడి మున్ను నిప్పుడు నప్పగిడిని
జేసికొన నగు వచ్చెడి నేగి మేలు
లందు నెయ్యది యధికంబొ? యారయ వలయు.

# ఆయుర్వేదము — ఆంధ్రుల కర్తవ్యము

ఆచంట లక్ష్మీపతి గారు, బి. ఏ. ఎం. బి. సి. ఎమ్.

ఆంధ్రరత్నమనఁ దగిన వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులుగారు మన దురదృష్టమున కాలధర్మము నొందుట సంభవించినది. ఆచార్యులవారు కేవలమును మన ఆంధ్రదేశమునందొక్క చోట మాత్రమేగాక భరతఖండమునందంతటను విఖ్యాతిగాంచినవారు. వారున్నంతకాలము మరెవ్వరి సాయము మక్కరలేకయే ప్రజాహితకరము లగు నాయుర్వేదకార్యము లన్నియును అవలీలగా నెఱవేరుచుండెను. వారు లేనిలోప మిప్పుడుగదా తెలియుచున్నది. మాటలకేమి గాని- సంవత్సరమునకు పదివేల రూపాయలకు మించిన వ్యయమును భరించి, భరతఖండమున కంతటికిని ఆదర్శ మనఁదగినట్టి ఒకకళాశాలను ఆయుర్వేద ధర్మవైద్యాలయమును 10,15 సంవత్సరములు తామొక్కరే నిర్వహించుటకు ఎంతటి ప్రజ్ఞాప్రాభవములు కావలయునో ఆలోచింపుడు.

ప్రకృతము ఆయుర్వేదపు స్థితి సందిగ్ధావస్థలో నున్నది. ఇంతవఱకును ప్రభుత్వమువారును, వారి వైద్యశాఖాధికారులును ఆయుర్వేదమునకు తాము ప్రతికూలురమనుటను బాహాటముగ వ్యక్తపఱచుచుండిరి. ఆయుర్వేదము పట్ల తామున్నంతకాలమును ఎట్టి సానుభూతిని జూపమని శాసనసభలో నిదివఱకు వైముఖ్యమును జూపిన సర్జనుజనరలు గిఫర్డుగారే గడచిన ఫిబ్రవరిలో నూతనశాసన నిర్మాణసభలో ప్రజాప్రతినిధుల మనుకొను వారిబలము హెచ్చగుటచేత మౌనము వహింపవలసివచ్చినది. తరువాత "ఆయుర్వేదాభివృద్ధికై పలయు కార్యములను నిర్వహించుటకు ప్రభుత్వమువారు వెంటనే పూనుకొనవలయును" అను ఏ. ఎస్. కృష్ణారావుగారి తీర్మానము అంగీకృతమైనది. తదనుసారముగ నాయుర్వేద ప్రాశస్త్యమును పరీక్షించుటకై ప్రభుత్వమువారు కమిటీని ఏర్పఱచిరి. ఫలితము ముందు విశదమగును.

**డాక్టరు కోమనుగారి రిపోర్టు**

ఇది ఇట్లుండగా, ప్రభుత్వమువారు, 1918 ఆగస్టులో ఆయుర్వేదౌషధములలో నుపయోగకరము లగునవి ఏవియైన నున్నవేమో పరిశోధించుటకు డాక్టరు కోమనుగారిని నేమించిరి. కోమనుగారిని నేమించునప్పుడు శాసనసభ్యులు "వీరి నియామకము ఆయుర్వేదాభివృద్ధికా? లేక, ఆంగ్లవైద్యాభివృద్ధికా?" యని ప్రశ్నింపగా, ఆయుర్వేదము అశాస్త్రీయమనియును, కోమనుగారి నియామకము ఆయుర్వేదములోగల ప్రశస్తౌషధములను ఎఱుంగుటకే యనియును చెప్పిన ప్రభుత్వమువారి ప్రత్యుత్తరమును బట్టియే ఫలితముగూడ నూహింప నగుపడియెను.

డాక్టరు కోమనుగారి రిపోర్టు ఇపుడు బయలువెడలినది. కోమనుగారి విషయమున నాకు పరిపూర్ణమగు విశ్వాసము కలదు. ఆయన ఆయుర్వేదము నెఱుఁగని వాడే యయ్యును ఆయుర్వేదాభిమాని యనక తప్పదు. తాము ఆయుర్వేదౌషధములను పరీక్షించితిమనియును, అందు ముప్పాతికమూడుపాళ్లు ఉపయోగకరములును సులభ్యములు నుగా నున్నవనియును వారు వ్రాసినారు. కాని మనకు వీరి రిపోర్టును చదువకముందే ఈవిషయములు తెలిసియున్నవి. కాని తొలుత ప్రశంసకు గడంగిన వీరిలేఖిని ప్రభుత్వాధికార వాసనావశమునఁ గాఁబోలు- ఆయుర్వేదము శాస్త్రీయ పద్ధతులకు దూరమనియును, ఇందు తాము తెలిసికొనుటకు ఏపాతచెత్తయో కాని, బ్రిటీషు ఫార్మకోపియా మందులలో కంటె నిందు పరిగణింపఁ దగిన విశేషౌషధములు లేవనియును ఆయుర్వేదౌషధములకంటెను ఆంగ్లేయ ఔషధములే సర్వసాధారణముగ నుపయోగింపఁదగినంతటి చౌకగా నున్నవనియును ఆయుర్వేదౌషధశాలలకంటె ఆంగ్లేయౌషధశాలలే సులభసాధ్యము లనియును సిమ్మన్నగు వాక్యరత్నములతో రిపోర్టు పర్యవసానమును నింపెను. కాని అరిపోర్టును పరికించినచో, మనకు వారు వివరించిన ఔషధగుణ చర్చనుబట్టి వారి యనుభవ మొకటియనియును, వారు సర్కారుకిచ్చు సలహా పర్యవసాన మింకొకటి యనియును తోఁచక పోదు. వీరు 225 మందులను పరీక్షించి అందులో నూటికి 75 వంతులు నుపయుక్తములని వ్రాసియును పర్యవసానము నిట్లు వ్రాసిరి.

వీరు పరీక్షించి మందులనుగుఱించి తెలిపిన అనుభవవాక్యములను పర్యాలోచించినచో ఆయుర్వేదౌషధములే ఆంగ్లేయౌషధముల కన్న సులభములును నిశ్చయముగ గుణదాయకములును అని తేలుచున్నది. అట్లు కాదేని వీరు తమ రిపోర్టులో ఆయుర్వేదౌషధములవలన దుశ్చికిత్స్యమై ఆంగ్లేయౌషధములవలన సుచికిత్స్యము అగు నొక్కవ్యాధినైనను చెప్పగలిగియుండిరా? క్వైనాలేనిది చలిజ్వరము దుర్నివార మను నాంగ్లసిద్ధాంతము కోమనుగారి రిపోర్టువలన వృపాపాత్రమైనది. మలేరియా జ్వర పురుగును కనిపెట్టి ఆవ్యాధిని మన ఆయుర్వేదీయౌషధములగు ఆనందభైరవి శీతాంశురసము పంచతిక్తపానకము మున్నగువాని ప్రయోగములచే నిర్మూలము చేయగలిగితి మని వీరు వ్రాసిన యొక్కయంశమే ఆయుర్వేద విజయమునకు ప్రధానమగు నిదర్శనము కాదా? ఇంతయేల? చరకమహర్షి నాటినుండి నేటివఱకు మన కనుదినము ననుభవసిద్ధములై ఆచరణలో నున్న ఔషధముల వలననే ఈవిషయము స్పష్టమగుచున్నది.

ఆయుర్వేదగ్రంథములు వ్యాధిపరీక్షణముఁ జేసి స్పష్టముగా సాధ్యాసాధ్య కష్టసాధ్యములను విభజించి ప్రదర్శించినవి. వీనిలో అసాధ్యము లని పేర్కొనిన ఏయొక్క వ్యాధినైనను - కుదుర్పగల ఆంగ్లేయౌషధములను తాము చెప్పగలరా? యని కోమనుగారి నడిగెదను. బ్రిటిషు ఫార్మకోపియాలో లేని-ఆయుర్వేదమునఁగల-విశేషౌషధము లేవైన గలవా? యని వీరు ప్రశ్నించిరి. కాని, ఈప్రశ్నమునకే- ఆయుర్వేదమునం దసాధ్యములని పేర్కొన్న వ్యాధుల విషయములో ఆయుర్వేదము-ఆంగ్లదేశపు ఫార్మకోపియానుండి గ్రహింపక తప్పని యౌషధము లేవైన నున్నవా?-యని ప్రతి ప్రశ్నముఁ జేసినచో తరేమి ప్రత్యుత్తరము నిచ్చెదరో? ఈమాటలు నేను స్వాభిమానముతో ననుటలేదు. మన ఆయుర్వేదములో లేనివానిని - గుణదాయకములైన వానిని-మన ఆయుర్వేదగ్రంథములు దురభిమానముఁ జూపక మహోదారమతితో ప్రతిశతాబ్దమునను పరిగ్రహించుచునే యున్నవి. నల్లమందు రేవలచిన్ని మొదలగునవి ఇట్టివే. బసవరాజీయమున్నగు పూర్వాంధ్రాయుర్వేద పండితులును-ఆయుర్వేద గ్రంథకర్తలును-ఇట్టి యనుభూత ప్రక్రియలను తమతమ గ్రంథములలో చేర్చియే యున్నారు. ఇట్టివారి పరిశ్రమల ముందఱ కోమనుగారివంటి ఆంగ్లవైద్యుల పరిశ్రమ లేపాటివో వ్రాయవలయునా?

కొంతకాలముక్రిందట మనదేశము "పాలకుల వేషభాషలు మున్నగునవి గౌరవప్రదము" లన్న వ్యామోహమున మునిఁగియున్నది. కాని కాలచక్రము పరివర్తితమగుటఁ గాఁబోలు ప్రకృతము వెనుకటి పద్ధతులను వదలిపెట్టి స్వదేశ స్వభాషాదులు గౌరవ

ప్రదములని ప్రజలు పొగడ నారంభించినారు. కాని ఇందును లోపములేక పోలేదు. కేవలము అభిమానముతో గాక సౌష్ఠవాసౌష్ఠవములను మంచిచెడ్డలను తెల్పగలజ్ఞానము ఏజాతివారి నుండియైనను పరిగ్రహింపవలసినదే. మనము మన ఆయుర్వేదగ్రంథములను వైద్యప్రచారమును చక్కగా పరికించి, వలసినచో సంస్కరించికొని వృద్ధికి రావలసియున్నది. కనుక ప్రకృతము ఆయుర్వేదాభివృద్ధికై చేయవలసినవిధానములను చర్చించి ఏర్పఱచుకొనవలయును.



ఫార్మసీవారి ఔషధనిర్మాణశాల

ఇందులకు విస్తారముగా గానున్నను కొన్నింటికైనను ఆయాపట్టణములలో ఆయుర్వేదమును ప్రచారము గావింప కళాశాలలును ఔషధాలయములును ఏర్పాటు కావలయును. ప్రజలును దేవస్థానాదిధర్మవిచారణకర్తలును ఇందులకు తోడ్పడి నూతనప్రతిష్ఠాపనములలో సమగ్రాయుర్వేదగ్రంథపఠనము మాత్రమే గాక, నవీనములగు శారీర శాస్త్రాదులను నేర్పు ఏర్పాటు చేయవలయును.

ఆయుర్వేద పరీక్షలు

ఏదేశమునందైనను సరియే మంచితోబాటు చెడ్డయును అనుసృతమగుచుండును. అట్లే మనదేశమునందును వైద్యులవిషయమున గలదు. ఇట్టి లోపమును పోగొట్టి నిజమగు సుశిక్షితత్వమును నెలకొల్పునవి పరీక్షలు. నిఖిలభారతీయాయుర్వేదవిద్యాపీఠము వారు ఇప్పటికి 10, 15 సంవత్సరములనుండియును వివిధదేశములలో వార్షికపరీక్షల నేర్పాటుచేసి సుశిక్షితులని విద్యాపీఠము నిర్ణయించిన సద్వైద్యులకు బిరుదములనిచ్చి సత్కరించుచున్నారు. ఇప్పుడీ పరీక్షలు మన ఆంధ్రభాషలో గూడ బెజవాడయందున్నను ... జరుగుట కేర్పాటులు జరిగినవి. విజ్ఞానఘనులగు వైద్యులు, తమతమ శిష్యులను ఆ పరీక్షలకై పంపి, దేశమున ఆయుర్వేదవైద్యులకు సర్వోత్తమగు స్థానము లభించునట్లు ఏర్పఱుపవలసి యున్నారు.



ఫార్మసీవారి ఓషధుల తోట

ఔషధములు

పూర్వము మన దేశమునందు రాజులే స్వకీయద్రవ్యమును వ్యయపఱచి, అమూల్యములగు ఔషధములను చేయించి, తమ యుపయోగమునకు పోగా మిగిలిన వానిని ప్రజల యుపయోగమునకై వినియోగించుచుండెడివారు. కాని ప్రస్తుతము ఆ పద్ధతులు పోయి విదేశీయవైద్యులు-విదేశీయౌషధములు-పాలకుల యభినివేశము ననుసరించి ప్రబలము చెందుటచేత, దేశీయవైద్యులును దేశీయౌషధములును మూలఁబడినవి. పైగా ఇట్టిస్థితిలో దేశీయవైద్యమునకు పూర్వపు ఉన్నతిని దెచ్చుటకై మనము లక్షలకొలది సొమ్మును వ్యయము చేయవలయును. మనదేశపు జనుల కందఱకును సరిపోవునంతటి యౌషధములను ఓషధులను మనము విరివిగ లభింపజేసినఁగాని ప్రస్తుత వినాయవనతి తొలగదు. ఇట్టి ఏర్పాటులను కావించుటకు మనము వర్తకసంఘముగా ఏర్పడి పనిచేయుట భావ్యము. ఈ యుద్దేశముతో నే నొక జాయంటు స్టాకు కంపెనీని ఏర్పాటుచేసి ఆంధ్రాయుర్వేదఫార్మసీ అను పేరుతో నడపుచున్నాను. ఆంధ్రులనేకులు నాకు తోడ్పడినారు. కడచిన జనవరి 17 వ తేదిని ఈ ఫార్మసీకి పిట్టి త్యాగరాయశెట్టిగారి అధ్యక్షతను ప్రారంభోత్సవము జరిగినది. ఆంధ్రదేశీయుల పరిపూర్ణమగు తోడ్పాటుతో ఈ యుద్యమమును నిర్వహింపనున్నాను. ఈ గొప్పయత్నము సఫలమై ఆంధ్రదేశమునకు కీర్తిని తెచ్చునట్లు దేశీయులును దైవమును అనుగ్రహము జూపవలసి యున్నది.

# ఆయుర్వేద రసాయనశాస్త్రముల పరస్పర సంబంధము

వేమూరు విశ్వనాథశర్మ గారు; యం. ఏ. ఎల్. టీ.

ప్రకృతిశాస్త్రములలో ఆయుర్వేదమునకును రసాయనశాస్త్రమునకును పరస్పరమైత్రి చాల గలదు. ప్రతిదేశము నందును రసాయనశాస్త్రాభివృద్ధికి ముఖ్యముగ వైద్యులును రసవాదులును కారకులు. రసవాదు లనగా నీచధాతువులను వెండి బంగారములుగ మార్చుటకు ప్రయత్నించెడివారు. మనదేశములో కూడ ఈ రెండు శాస్త్రములును చిరకాలము క్రిందటనే యభివృద్ధిఁ జెందినవి.

రసవాదుల యోగములు చాలవరకు గోప్యముగ నుండుటచేత నవి రసాయనశాస్త్రసిద్ధాంతముల నెంతవరకు అనుసరించుచున్నవో చెప్పుటకు వీలు లేదు. కాని వైద్యశాస్త్రయోగములను రసాయనశాస్త్ర సిద్ధాంతముల బట్టి పరీక్షింపవచ్చును. మొదట మన దేశములో మందులను కేవలము ఓషధులతో చేసెడివారు. కాని కాలక్రమమున రసవిషగంధకాదు లగు ఖనిజములను కూడ ఆయుర్వేద వైద్యులు శుద్ధిచేసి లోపలికి వాడుట కారంభించిరి. నాటినుండియు వైద్యశాస్త్రయోగములు రసాయనశాస్త్ర సంబద్ధములై యీ రెండిటికి పరస్పరసంబంధము గాఢము అయ్యెను.

వస్తుతత్వమును నిరూపించునది రసాయనశాస్త్రము. వస్తువుల యొక్క గుణాగుణములను కనిపెట్టి లోపలికి పుచ్చుకొనునప్పుడవి శరీరమునం దెట్టి పరిణామములు పుట్టించునో తెలుపునది వైద్యశాస్త్రము. వస్తుసంఘట్టనము వైద్యశాస్త్రమునకు అవసరముగనుకను, ఈ సంఘట్టనము రసాయనశాస్త్ర సిద్ధాంతములకు బద్ధమై యుండుటచేతను ఆయుర్వేదవైద్యులకు రసాయనశాస్త్రపరిచయము అవసరము.

పాశ్చాత్యులలో కాలక్రమమున రసాయనశాస్త్రము ప్రత్యేకముగ స్వతంత్రశాస్త్రముగ నభివృద్ధి జెంది వైద్యశాస్త్రమునకు తోడ్పడుచున్నది. కాని మనదేశములో కొంతకాలము గడచిన తరువాత అన్ని శాస్త్రములవలెనే వైద్యశాస్త్రముకూడ క్షీణించి రసాయనశాస్త్రాభివృద్ధికి గూడ నిరోధము గలిగెను. ఈ కారణముచేత మనదేశములో రసాయనశాస్త్రము స్వతంత్రశాస్త్రముగఁ బరిణమించుటకే యవకాశము లేకపోయెను. కాని పాశ్చాత్యవైద్యులలో ప్రతివానికిని రసాయనశాస్త్రముఖ్యసిద్ధాంతములు వ్యాత్కవిలగ నుండును. మన ఆయుర్వేదవైద్యుల కిట్టి శాస్త్రపరిచయమే లేదు. కావున రసాయనశాస్త్ర సిద్ధాంతములను కొన్నిటి నీవ్యాసమునందు తెలిపెదను.

నంటి ఔషధముల తరువాత లోహములను భస్మముచేయుట ఆయుర్వేదములో ముఖ్యయోగము. ఇవి సామాన్యముగ పుటములు వేసి తయారుచేయుదురు. ఈ భస్మములు ముఖ్యముగ ప్రాణవాయువుతో గూడుకొనినవో, లేక గంధక సంబంధములైనవిగనో, యుండును. భస్మీకరణములో ఆయుర్వేదవైద్యులలో కొన్ని శాస్త్రవిరుద్ధములగు అభిప్రాయము లున్నవి. రసమును గంధకముతో గలిపి భస్మము చేయునప్పుడు ఒకపాలు రసముతో నొకటి మొదలు ఆరుపాళ్ల వరకు గంధకము నూరి, దానిని గాజుకుప్పెలో వైచి, వాలుకాయంత్రముతో వండెదరు. ఇట్లు వండినప్పుడు రసము సిందూరించి గాజుకుప్పెయొక్క పైభాగమున కంటుకొనియుండును. ఇట్లు తయారైన సిందూరము గంధకపు పాళ్లను బట్టి ఆరువిధములగు సిందూరములను వండవచ్చునని ఆయుర్వేద వైద్యుల యభిప్రాయము. రసముతో సరికిసరి గంధకమును గలిపి వండిన సిందూర మొకటనియును, ఆఱురెట్లు గంధకముతో వండిన షడ్గుణమను సిందూరము మరియొకటనియు వారి యభిప్రాయము, కాని యిది శాస్త్రసమ్మతమైనది కాదు. వస్తుసంయోగమునందు పరిమాణనియమ మున్నది. అనగా రసము గంధకముతో కూడి సిందూరించునప్పుడు తులము రసమునకు అందులో ఆరవ వంతు గంధకము కలిపి నూరిన చాలును. పాతికతులము రసముతో సిందూరించుటకు నాలుగు తులముల గంధకము చాలును. ఇంతకంటె నెక్కువగంధకము కలిపినయెడల నాలుగు తులములు మాత్రమే రసముతో గలిసి మిగిలినదంతయు ఆవిరిరూపమున నెగిరిపోవును. సిందూరము వండునప్పుడీ యావిరిరూపమున నెగిరిపోయిన గంధకము గాజుకుప్పెయొక్క మూతిచివర నుండుచుండును. పాతికతులము రసముతో నాలుగుతులములకంటె తక్కువ గంధకము గలిపినయెడల కొంతరసము సిందూరించక మిగిలిపోవును. ఇట్లు మిగిలియుండిన రసము ఆవిరిరూపమున కొంతయెగిరిపోవును. మరికొంత గాజుకుప్పెయొక్క పైభాగమున కంటుకొని సిందూరముతో గలిసియుండును. మనవైద్యులు చేసెడియోగములలో రసముకంటె తక్కువ గంధకమెప్పుడును తీసుకొనరు. గనుక సిందూరించని రసము మిగిలియుండకూడదు.

ఆయుర్వేద వైద్యులకు తెలియవలసిన రెండవసంగతి తూనిక సంబంధమైనది. ఆఱుతులముల రసమును 36 తులముల గంధకముతో గలిపి నూరి సిందూరింపఁ జేసినప్పుడు 6 తులములకంటె నెక్కువషడ్గుణము రాదని మనవైద్యుల యభిప్రాయము. అనుభవములో 6 తులములకంటె కూడ తక్కువయే వచ్చును. కాని శాస్త్రప్రకారము ఆరున్నర తులముల షడ్గుణము రావలెను. ఆఱుతులముల రసము అరతులము గంధకముతో సంయోగించిన షడ్గుణమగును. ఇట్టి స్థితిలో ఆఱున్నరతులములకంటె తక్కువషడ్గుణము రాకూడదు. ఐనను వండుటలో నెక్కువగ కలిపిన గంధకమే కాక సిందూరము కూడ కొంతయావిరిరూపమున ఎగిరిపోవును. ఇందుచేత షడ్గుణముయొక్క తూనిక తగ్గును. ఈ రీతినే లోహాదులను భస్మము చేయునప్పుడు భస్మముల తూనిక ఆయాధాతువుల తూనికకంటె నెక్కువ రాకూడదనియు సరికి సరి తూనికవచ్చు వరకును పుటములు వేయుచుండవలెననియు మనవైద్యుల యభిప్రాయము. కాని యీ యభిప్రాయము శాస్త్రసమ్మతమైనది కాదు. లోహాదులు భస్మములగునపుడవి గాలిలో నున్న ప్రాణవాయువుతో సంయోగించును. అనగా ధాతువులును ప్రాణవాయువును చేరి భస్మములగుచున్నవి. అందుచేత భస్మములయొక్క తూనిక ఆయాధాతువుల తూనికకంటె నెక్కువగనే యుండవలెను. భస్మీకరణమునందు ధాతువులను ఓషధులతోను పసర్లతోను గలిపి నూరుదురు. అప్పుడు కొంతమందు ఖల్వమును బట్టుకొని యుండును. పుటము వేయునప్పుడు కొంత ఎగిరిపోవచ్చును. ఇట్టి కష్టములు లేకుండ భస్మీకరణము చేసినయెడల భస్మములయొక్క

# స్మృతి పద్యములు

శ్రీలీలాపరదేవవైద్యుఁ డని ధాత్రిం దన్నుఁ గీర్తింప, స
ద్యోలాభంబునఁ గుక్షినించుకొనకాయుర్వేద వైద్యప్రచా
రాలంబంబె పవిత్రజీవనము గా వర్తించు, మా దీవి గో
పాలాచార్యుఁడు వైద్యరత్న మకటా పైలోకముం జేరెనే.

క. మాపాలిటి మందారము
మా పెన్నిధి మాగురుండు మామాన్యుఁడు మా
గోపాలాచార్యుం డ
న్నా పోయెనె మమ్ముఁ బాసి నాకమ్మునకున్.

మ. అనఘా నీవు జ్వరార్తి నుంటి వని మేమాలించుమాత్రాన గ్ర
క్కున మాగుండెలు వ్రయ్యలయ్యె నపుడా గోదావరీ మండలం
బునఁ గావించిన వైద్యసంస్తుతుల, నామ ప్రెట్లు దప్పించుకొ
న్న నినున్ మ్రింగెనకాలమృత్యు వకటా నత్తాడు దౌష్ట్యంబుతోన్

సీ. నినుఁగాంచఁ బద్మాలయను పూర్చి వ్రత మేమి
సలిపెనో రాజ్యలక్ష్మమ్మ తల్లి
తిలకింప రామకృష్ణుల కిడెనో యెన్ని
పూజలు రామకృష్ణుండు సతము
నిను శిష్యుఁగాఁ గాంచ వనజాక్షు ని సపర్య
లేమి జేసెనో ఘట్టస్వామి గురుఁడు
నిను భర్తగాఁ గాంచ నిఖిలేశు నేరీతి
నర్చించెనో యర్థి నాంధ్రమాత.
ఆరయఁ బితరులును గురులును నట్టివంశ
మవని ధన్యతగాంచిన దనుట నిజము
దీనివంశంబె యమృతంపు దీవి. కాని
యకట గోపాల మముఁ బాసి యరిగి తెట్లు ?

సీ. సతతంబు శాంతరసం బొల్కుచుండు నీ
యకలంక ముఖచంద్రు నరసి యరసి,
నిస్స్వాళిపై నింపు నీదు దాక్షిణ్యంపు
టీక్షణ స్తోమంబు నెంచి యెంచి
నెమ్మది మ్మొదయించు నీ మహామంద మం
దస్మిత రోచులఁ దలచి తలఁచి
యఖిల లోకులకు మహారోగ్యదంబగు
నీదు వాక్సుధ నాత్మ నిలిపి నిలిపి.
పొగులుచున్నారు నీదు బంధుగులు వైద్య
గణము లాప్తులు శిష్యలోకములు నార్య
లఖిలజనములు వీరు వారనక నిపుడు.
మఱల యెపుడైన జూతుమె మాన్య నిన్ను?

సీ. ధన్వంతరి నిను మాఱిఁ దాల్పవే. యెన్నెన్ని
మండలాయుర్వేద మహితసభలు
నినుఁ బరీక్షకు గాగ గొనలేదె యగణితా
యుర్వేద పాఠశాలోత్తమములు
నినుఁ బ్రధానచికిత్సకునిఁ గా బడయరే కృ
తార్థులై పెక్కంద్రిలాధిపతులు
నీ స్నగ్రపీఠిని నిల్పదే పలు మాఱు
భారతీయుర్వేద భూరిసంఘ.
నక్కటకటా! నేడు నిన్నంత కన్న
నున్నంత బగు పదవ్రలనుంచ నెంచి
నమరపురికి గొంపోబోలు నావిధాత
దీవికులచంద్ర ! గోపాల ధీబుధేంద్ర!

సీ. ఏ యింటఁ గనుగొన్న నీయమోఘసుధా వి
తానంబులే గదా ధన్యచరిత
ఏపత్రికారాజ మీక్షించినను నీదు
ప్రకటనలే గదా ధన్యచరిత
ఏవైద్యతతి గోష్ఠి నెలమితో విన్నను
నీ ప్రశంసయె గదా నిర్మలాత్మ
ఏ యూరఁ గనుకొన్న నింపైన నీ యాప
సంఘంబులే గదా సదయహృదయ.

గీ. అకట దుర్వైద్యతిమిరంబు నణఁచి విపుల
విపులసద్వైద్యతేజంబు వెలుగజేయు
నీ మహాజ్యోతి యేమయ్యె? నో మహాత్మ
వైద్యలోకంబునకు లోటుమఱల నేడు.

శా. ఆయుర్వేదము నుద్ధరింప భవదీయంబైన సర్వస్వమున్
ప్రాణంబున్ వినియోగపెట్టి మిగులన్ భాసిల్లి యున్నట్టి నీ
యాయుర్వేద కళాలయం బిఁకను నేమాధారతన్ బొందునో
ఆయుర్వేదపితామహా! యెఱుంగ మయ్యా నెన్న పట్టంబునన్.

ఉ. చారత రాపవర్గమున, స్వర్గమునందొ, వికుంఠమందొ నీ
కోరిక చొప్పు నెట్లిటు లనంతవైభవయుక్తితోడ వి
స్తారసుఖంబు చేకొనుము సర్వసుపర్వసమేనిశాయ ప
త్కారముతోఁ బరాత్పరు నఖండకృపన్ సుఖముండుమా బుధా.

కోన రాఘవయ్యగారు

మ. జననీభారత మాత నీదు సుతులీక్షా మండలిన్ భవ్యులా
యనఘోత్తంసులఁ జూచికొంచు మది నిత్యానందమున్ జెందు నీ
ఘనమోదంబును భంగపుచ్చి యకటా కారానిదుఃఖంబు గ
ల్పనఁజేసెం గద నిను కావిధి బుధుల్ భావంబునన్ దూరగాన్.

శా. ఆయుర్వేదము నుద్ధరించుటకు నై యాంధ్రప్రపంచంబునం
జేయూవిర్భవమొంది జీర్ణదశలో నేమాలనో యున్న యా
యాయుర్వేదము నుద్ధరించి నిజశిష్యశ్రేణి విఖ్యాతిమై
యీయాంధ్రోర్విని నిలుపఁ జేసిన సుతుం డేగెన్ దివిన్ జూడగన్.

బీ. డి. ప్రసాదరావు

Late Pandit, D. Gopalacharlu



కీర్తిశేషులైన పండిత, డి. గోపాలాచార్యులవారు

Late Tanjanagaram Thevapperumaliah Garu



కీర్తిశేషులైన తంజనగరము తేవప్పెరుమాళ్లయ్యగారు

కీర్తిశేషులైన లోకమాన్య బాలగంగాధర తిలకు




శ్లో. యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం.

# లోకమాన్య బాలగంగాధర తిలకుమహారాజు

### పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు

నియతినామక సాంద్రనీహార తతిఁబ్రుంగు భరతాత్మజుల పాలి భానుమూర్తి, కారాగృహంబులే, కనకసౌధములుగా సంతసించిన కార్యసాధకుండు, కర్మయోగమె కృష్ణఘనభావమని సదా బోధగావించిన పుణ్యమూర్తి ఐహిక సుఖముల నావంతయేనియు సరకుసేయని యట్టి సాధుజనుఁడు, తనదు జీవితమంతయు ధన్యముగను, దేశసేవల వెలయించు ధీరతముఁడు, లోకమాన్యతఁ గన్న వివేకఘనుఁడు, బాలగంగాధరుఁడికేఁడి? భారతాంబ!

### జనమంచి సీతారామస్వామిగారు పిఠాపురము

సీ. ఏపండితుని మాటయెల్ల ప్రాజ్ఞులకును విజ్ఞానసంయుక్త వేదవాక్కు,
ఏధీరు ప్రావీణ్యమెల్ల యోధులకును ధర్మసంగరమార్గదర్శకంబు
ఏధన్యు జీవితంబెల్ల మానవులకు దేశాభిమానోపదేశకర్త, ఏమహా
త్ముని నామమెల్ల హైందవులకు పరమానురాగసంపాదకంబు.
అట్టి బాలగంగాధరుడక్కటకట మనలనందఱ విడనాడి చనియె
దివికి, ఎంతకష్టము ప్రాపించె నింతలోన! కడుపుచెఱువగుచున్నది
గాని, దిటము తెచ్చుకొన శక్యమె యెట్టివారలకును

### కాశీనాథుని చిన వీరభద్రయ్యగారు ఈడుపుగల్లు

ఉ. భారతమాతృ పుత్రుఁడయి, భారతదేశము వృద్ధిఁజేయగా, భారము
నూని బోధలను బాగుగఁజేసి స్వరాజ్య బీజమున్ వారకవిత్తెఁ
జిత్తముల, పండకమున్నె మహాత్ముఁడక్కటా! భారతమాన్య
డౌతిలకభానుడె యస్తమునందె మాతరో!

చ. అనఘుఁడు లోకమాన్యఘను డన్నను భారతదేశవృద్ధియే ఘనమని
యెంచి కష్టములగాంచియు ఖైదుననుండి గీతలన్ ఘనమతి కర్మ
యోగమను గౌరవమందగ వ్రాసె గ్రంథమున్ ఘనతరకీర్తిగాంచి
యిటు కాయముఁ బాసెను భారతాంబరో!

### రాజా మంత్రిప్రెగడ భుజంగరావుబహద్దరుగారు

సీ. అధికారులెన్నెన్ని విధముల బాధించి, పట్టుపల్లార్చిన భయముఁగనక,
కారాగృహప్రాప్తి భారంబనక దేశసేవకై పలుమారు సిద్ధ
పడియు, మితవాదులను పదాహతి దిగ్భ్రమనుగొల్పి, పరదేశ
మున ధైర్యపటిమఁ జూపి, సంక్షోభ దెల్పి రాజద్రోహులనణంచి,
వారి ధాకలకు భీభత్సుగాక, దేశసేవను పరమావధిగ గణించి,
మానధనముల లెక్కింపఁబూనుకొనక, భరమహారాజ పదవిరుదంబుఁ
బ్రజల, వలనఁగాంచిన తిలకు దివంబుఁ జెందె.

### ఎన్. సుబ్రహ్మణ్యదీక్షితులు. పుంగనూరు

శ్రీమత్సద్గుణమండితోదర! యశశ్శ్రీశోభితాకాంతరా!,
కామాదిద్విషదద్రివజ్రధర! లోకఖ్యాత-విద్యాధరా!, భూమ
ప్రేమవిలోకితార్తనికరా!- ప్రఖ్యాతవతారా! [illegible] మెండెంబు
నొసంగునీకు బుధమాన్యా! బాలగంగాధరా!

క. ఒకచో నాత్మ సతీవియోగము మఱొక బుగ్రాధ [illegible],
చిరకముక్తాపి నుమెట్టి; నొక్కయెడ [illegible] గారాలయం
బకలంకస్థితి ధైర్యమూని [illegible] రవు
గీతార్థముఁ దెల్పినావహహా! శ్రీ-రా-బాలగంగాధరా॥

### చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు

గీ. పరిమళ దుద్యానభూముల బ్రబ్బుచున్న [illegible]
ఖాంతరమున, సంతస వసంతవేళఁ బ్రజాసుఖముగఁ [illegible]
పిక "తిలకుఁడు" బుబోయె.

### కా. అప్పయ్యశాస్త్రిగారు

శా. స్వారాజ్యంబు స్వరాజ్యసంఘము నిలబెట్టెంబాటి [illegible]
కారాగారము నంగినుంచిన [illegible] కార్యంబు చాలించకే, దారా
బంధుల గోలుపోయినను [illegible]
బునఁ జేసి మానుష [illegible]
బుసమస్త దేవతల, దేవా బాలగంగాధరా.

### దూ. ముసయ్యగారు ప్రొద్దుటూరు

మ. అనఘాత్మా! [illegible] యారోగ్యమున్,
దనయున్ [illegible] బ్రో
లిననీయంతము దెల్పె! నీమరణ [illegible] సజ్జన
చిత్తంబుల కాల్చివైచె, సుతపమా! బాలగంగాధరా.

### బ్రహ్మాభట్ల పట్టాభిరామశర్మగారు గుడివాడ

సీ. భరతమాతృకగర్భ-పాథోధికౌస్తుభుఁడు, పూర్ణచంద్రునిభాతి బా
డమినాడు, అజ్ఞానతిమిరసం-వ్యాప్తులకెవ్వాడు బాలసూర్యుని
భాతిఁ బరగినాఁడు. స్వేచ్ఛావిరహితులై-చెలఁగు హైందవపాళిఁ
గావంగ నెవ్వాడు-గడిగినాఁడు. భరత దేశస్థితి- బాగుజేయుగ నెంచి
ఇంగ్లాండునకు నెవ్వ డేగినాఁడు. భారతీయైకమోక్ష ప్ర-చార
మునకు తగినకార్యము లెవ్వాండు దలఁచినాఁడు అట్టి శ్రీ బాల
గంగాధరాఖ్యతిలక మస్తమించెను మనల శోకాబ్ధిఁద్రోసి.

### యెడ్లపాటి వెంకట సుబ్బారావుగారు

మ. కలలో నిన్నటు దోఁచు నీచరణమో కైవల్యసంప్రాప్త! లోపల
నెంతో దిగులట్టిపోదుకొన్న [illegible] బోయినన్, పలు
భంగుల్ భవదీయమూర్తిఁ గనెనన్ [illegible]
సేమృత్యువు మ్రుగ్యమంచు [illegible] శాంతిచేకూరునో?

### సుబ్రహ్మణ్యభాగవతులు తెనాలి

సీ. మూడుభాగములను సంపూర్ణమై దుష్యంబు బడసిన యట్టి సత్పండి
తుండు, అంతరాత్మయునుదే శాభివృద్ధికి కానిపనినికస్మాత్తిమా దని
స్థిరుండు, తనదైన బడినకేను ననన్యసామాన్య మనగ వాదించిన
న్యాయవాది, బంధనమ్మున కర్మ పరముగా గీతలవ్యాఖ్యవ్రాసిన
మేటి భాష్యకర్త, బాలగంగాధరాఖ్యప బ్రాహ్మణుండు అఖిల
భారతజనహృదయాలయముల తనసుమూర్తి ప్రతిష్ఠించి తాను
చేరె పునిపాయుజ్యమిందుకై చింతయేల.

గీ. ధర్మమునకును హానియు ధర్మమునకు
తగని యభివృద్ధికాగిన తరుణమందు
అవని నవతారమెత్తెద నన్న నీదు
పలుకునే నమ్మెదము వేద వాక్యమనుచు.

### గుండిమెడ వేంకట సుబ్బారావు

సీ. అకసాత్సమయాన, హా, జన్మదేశమా! యంచెంత మదిఃబల్వ
రించినావొ, మరణకాలమునందు, భరత ప్రపంచమా! అనియెంత
మదిభిగ్గ, వలచినావొ, అంత్యకాలమునందు, హా; మహారాష్ట్రమా
యని యెంతసంతాప, మందినావొ, తరలి పోయెడివేళ, ధర్మ
కస్వారమా! యంచెంత మది విచా, రించినావొ, అకట! పర
లోకమునకు నీ, వరుగువేళ ప్రేమమెంత దీపించి, వెడలి
నావొ, భువన సంచారివై యంతమూర్తి కెలుకమాన్య! గుణధన్య
హా! లోకమాన్యతిలక!

### కర్లపాలెము లక్ష్మీనరసింహముగారు

సీ. పాశ్చాత్యనభముపై ప్రాచ్యవిజ్ఞాన చంద్రికప్రసరించి హాస్యరింప
జేసి, భారత హృదయచకోరమ్ములను దేవసేవామృతమ్మున జేర
దీసి సకలకు వలయముల్ సర్వేశుగీతార హాస్యకరమ్ము నలరజేసి
నిజకాంతి శోభ చేసిఖిల నక్షత్రాళి కాంతి నెల్లహరించి వంతగూర్చి
శీతకరమున చోరులశిక్ష వేసి రాగిణులయందు తాపాగ్ని రగులజేసి
అక్కటా! వీడిపోయితె యబ్ధిగ్రుంకి బాలగంగాధర సుధా
కరాలాప!

### పల్లె వేంకటశాస్త్రి

ఉ. భారతమాత నీదగున భాగ్యము నేమనిబల్కువాడ హా
గౌరవతంసమై బరగు నూనుని మాన్యుని బాసినావు యే
వ్వారలు నీకుదిక్కికను వంతలవుంతలుగాక యమ్మ నే
నూరుల జన్మలొందియును నొందగ నేర్తువె? యట్టిపుత్రకున్.

### కే. బి. కోటిలింగకవి.

సీ. అఖిల భారతజాయ కాగ్రేసరుండు గీ, తారహస్యాది యుద్గ్రంథ
కర్త, సుస్వయం నిర్ణయ సూత్రోపదేశకుం, డఖిలదిగంతవి శ్రాం
తకీర్తి, ఆబాల్యమాతృదే శారాధనపరుండు, నధ్యాత్మవిద్యారహ
స్యవేది, సకల సద్గుణగణ ప్రకలిత సాంతుండు, కార్యశూరుం
డైన, కర్మయోగి. కష్టముల కోర్చి నిజసూను, ఖడ్గవాది, బాల
గంగాధరాభ్యవిద్వత్ప్రభుండు తను, ధనమనంబులోరులకై ధార
వోసి, భౌతిక శరీరముంబెడఁబాసె నకట॥

### గార్లదిన్నె సుబ్బారాయుడు గారు

సీ. భరతమాత కొలుకు పలుకష్టములఁ జెందె పలుకంగఁ దగు పుత్ర
తిలకుఁడితఁడె! దుర్జను లెన్నిరోహా తొందరల్ పెట్టిన నలయ
కోర్చిన సాధు తిలకుఁ డితడె, ఆలుబిడ్డలయెడ నాకాంక్ష యెట్టి
దో తెలియ కుండిన ఋషి తిలకుఁ డితఁడె, కారాగృహస్థుఁడై
కవితా సుధా రసం బొలికించె సత్కవి తిలకుఁ డితడె, ఇట్టి
సర్వతిలకుఁ డెంతయు మహనీయు డస్తమించె శుభము లస్త
మించె, దేశనేత్రముఖకు శేశయముల్ ముకుళించె విధి తెలియగ
నెంచఁ దరమె!

### దద్దనాల లక్ష్మీసత్యనారాయణయ్యగారు

సీ. అగష్టుమాస మారంభంబునకు నీదు కాలంబు జెల్లెదే కరుణసాం
ద్ర! నీవు బూనిన కార్య మెవ్వని మూపుపై దిగవెట్టి చనితివి దివ్య
నేత్ర! పరమపవిత్రమా చఁదీయునామంబు విననివా రెవ్వరు
విమలచరిత! స్వారాజ్య భారంబ స్వాతంత్ర్యులగు మమ్ము జూ
చుకొమ్మను మన్న జాడగలమె దేశభక్తులలోన యీసుని కృప
వలన నగ్రగణ్యుండవై నవతరించి. నట్టివాడవు నేడిట్టు లంతరించి
దేశమాతను మమ్ముతి తెంపులేని దుఃఖసంద్రంబు నందుల ద్రోసి
వేయ న్యాయమే నీకు నేనిట్టు న్యాయమార్గ.

### వుదయగిరి, శీతారామాచార్యులు.

ఉ. చూచితి వెల్లదేశములు చూచితి వెల్లసభల్ నరేంద్రులం
జూచితి వెల్ల హైందవుల నుంతయ టభ్యుదయంబు గూర్పగా
జూచితి వింతలోన విధిచోదితమో ప్రజలం దదేశముం
జూచితివేమొ తంద్రి దివిజొచ్చగ హా! తిలకా మహాత్మకా.

## చిన్నిబాలుఁడు

### కంచనపల్లి కనకమ్మ గారు

లయ లీవికారములు నీ చిరునవ్వులు నీవుయారముల్, ఈలలితంపు పల్కులును నీ సుమనోహరరూప సంపదల్
పాలమెఱుగు బుగ్గలును స్వచ్ఛవిలోచనసుందరత్వమున్, బాల రసాల నూత్నతర పల్లవకోమలహస్తయుగ్మమున్
మేలగు జారుబొజ్జయును, మిన్నగు చిత్తము, మందహాసమున్, జాలము గల్గజేసి మము సంతసపారిని ముంచు బాలకా!

# శరన్నవరాత్ర ప్రాశస్త్యము

దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు

నవరాత్ర మనఁ దొమ్మిది రాత్రుల కలయిక యని యర్థము. రాత్రిశబ్దము సమాసవశమున రాత్రమై యకారాంత మగుచున్నది. దేవీప్రీతికరముగా వసంతాది ఋతువులందు ఒక నవరాత్రము చెప్పఁబడినది. శరద్వసంతములు యమదంష్ట్ర లనియుఁ దదారంభమున తత్పరిహారార్థము చండీపూజనాదికము కర్తవ్య మనియు దేవీభాగవతము. ఇట్లు వసంత శరన్నవరాత్రములు రెండును సాధారణములుగా నున్నను, నిబంధకారులు అధ్యాసమున విస్తరింపక శరన్నవరాత్రములనే ఎక్కువగా నభివర్ణించి యున్నారు. బ్రహ్మాండపురాణాది గ్రంథములయందును శరన్నవరాత్రమే ప్రతిపాదింపఁబడియున్నది. లలితా సహస్రనామ భాష్యమందు - శారదారాధ్యా అను నామమునకు ముఖ్యముగా శరత్కాలపూజనీయ యను నర్థము వ్రాయఁబడినది. ధార్మికార్చనదీపిక యను గ్రంథములో - అశ్వినస్య సితే పక్షే ప్రతిపత్సు శుభే దినే, యనియు, మార్కండేయపురాణములో శ్లో. పూర్వవిద్ధాతు యా శుక్లా భవేత్ ప్రతిపదాశ్వినీ నవరాత్రవ్రతం తస్యాం న కార్యం శుభ మిచ్ఛతా" అనియు, స్కాందమున - ప్రతిపద్యాశ్వినే మాసి సా శుద్ధా శుభదా భవేత్ - అనియు దేవీపురాణములో శ్లో. "యో మాం పూజయతే నిత్యం ద్వితీయాదిగుణాన్వితాం ప్రతిపత్పూర్వదిం జ్ఞాత్వా సోఽశ్నుతే సుఖ మవ్యయం" మ్మనియు అన్వయవ్యతిరేకముఖము లైన వాక్యములచే శరన్నవరాత్రవ్రతము ఆశ్వయుజ శుద్ధ ప్రతిపత్తిథిలో నారంభ మగు నని చెప్పబడియున్నది. కాఁబట్టి లోకాచార మీ విషయమున ధర్మశాస్త్రపురాణానుసారముగా నున్న దనుట స్పష్టము. నవరాత్ర మాశ్వయుజశుద్ధ ప్రతిపత్తిథిలో నారంభమై మహానవమితో బూర్తి యగుచున్నది. ఇది తొమ్మిదిదినములు ప్రవర్తిల్లవలసిన కార్య మైనను తృతీయాది నవమ్యంతము సప్తరాత్రముగాఁ గాని, పంచమ్యాది పంచరాత్రముగాఁ గాని, సప్తమ్యాది త్రిరాత్రముగాఁ గాని, అష్టమ్యాది ద్విరాత్రముగా గాని, ఏకదినపక్షమునఁ గేవలాష్టమిని గాని, కేవలనవమిని గాని, ఆచరింప వచ్చునని సౌకర్యము చెప్పఁబడియున్నది. అకరణమందు దోషశ్రవణమువలన నిది నిత్యవ్రత మనియు ఫలశ్రవణమువలన నిది కామ్యకర్మ మనియు నేర్పడుచున్నది. నవరాత్ర కర్తవ్యములు శాస్త్రములఁ దొమ్మిది తెఱంగుల వివరింపఁబడి యున్నవి. (1) కలశస్థాపనము (2) దేవతాపూజనము (3) సప్తశత్యాదిజపము (4) అఖండదీపము (5) మాలాబంధనము (6) ఉపవాస నక్తైకభక్తాది నియమము (7) సువాసినీభోజనము (8) కుమారీభోజనము (9) స్తోత్రమంత్రపాఠాదులు. ఇందు దేవతాపూజనము ప్రధాన మనియుఁ దక్కినవి తదంగము లనియు శాస్త్రాభిప్రాయము. ఈ తొమ్మిది విధుల కేయే విశేషాంశములతో - కేయేవిధముగ భక్తిఁ గొల్చువారిని నలుపవలెనో నదియు భక్తితరంగిణ్యాది దేవీ గ్రంథముల యందు వివరింపఁబడి యున్నది.

రాత్రిశబ్దవిచారము

ఈ వ్రతము నాహ్నిక త్రైకాలిక పూజ ఉపపన్నముగా నున్నను, రాత్రిపూజయే యుత్కృష్టమును అధిక ఫలప్రదమును గావున దత్ప్రాశస్త్యమున ఈ వ్రతము నవరాత్ర మని చెప్పఁబడినది. కొందఱు దీనిని నక్తవ్రతముగానే చెప్పి యాహ్నికపూజా పరిత్యాగమును బోధించిరి. కాని ధర్మశాస్త్రజ్ఞులు రాత్రిప్రశస్తిరలన నాహ్నికార్యము త్యాజ్యము కాదనియుఁ గలశస్థాపనాది కార్యము ప్రమాణ ప్రాబల్యముచేతఁ బగలే కావింపఁ బడవలయు ననియు శాసించిరి.

## నవశబ్ద విచారము

'నవ' శబ్దము శాక్తసంప్రదాయమున నతి ముఖ్యము. సంఖ్యలలోఁ దొమ్మిది యెక్కుడైన స్వతంత్ర సంఖ్య యొకటి గణనమందున లేనుట స్పష్టము గదా! ఇది నవరాత్రపూజా విధానమున పర్యాధిక స్థానము నధిష్ఠించి యున్నది. ఈ వ్రతమునకుఁ బ్రథమాంగ మైన కలశపూజ నవాత్మకమంత్రముచేతఁ జేయవలసియున్నది. సువాసినీ భోజన కుమారీపూజనములును నీనవసంఖ్యాపరిమితములై యున్నవి. వరణీయ లైన కన్యల యొక్క నామములు తొమ్మిదియు వయోనియతిని బట్టి వేర్వేఱుగా చెప్పఁబడినవి. ఇష్టదేవత యైన దుర్గ యొక్క స్వరూపములును తొమ్మిదియే. నవకోటిశక్తి సహితయై నవావరణములకు లోపల నవదుర్గాస్వరూపమున వర్తిల్లు నవాత్మక మంత్రాధిష్ఠాన దేవతను నవసంఖ్యాపరిమితము లైన దినములలోఁ బూజించుట సమంజసమే. కావున ఈ నవరాత్రవ్రత మవశ్యానుష్ఠేయము.

## నవరాత్రవ్రతమునకు మూలము

ఇఁకను శ్రీరామనవమి, కృష్ణాష్టమి ఇత్యాదుల కున్నట్లుగా నవరాత్ర దినములకును పూజ్యదేవతా చరిత్రమునకును సంబంధ మేదేని గలదా! యనుట విమర్శనీయము. లోకాచారమును బట్టి చూడ-మన యాంధ్ర గౌడ వంగాదిదేశములందుఁ గూడ నవరాత్రములలో దేవీవిజయాదికము ప్రఖ్యాతింపఁబడుటయుఁ దమ్మూలమున నవి మహిషాసుర సంహారాది దేవీవిజయదివసములుగాఁ బరిగణింపఁ బడుటయుఁ గలిగియున్నది. కాని యిట్టి ప్రతీతికిఁ గారణము మృగ్యము. ఈవిషయము ప్రముఖముగా నుండవలసిన చండీసప్తశతిలోఁ గాని, దేవీభాగవతమునఁ గాని, మఱి మార్కండేయపురాణములలోఁ గాని, ఇది నిర్దిష్ట మని చెప్పఁబడి యుండలేదు. శరన్నవ

రాత్రిపూజ బహుఫలప్రద మను వచనములు విశృంఖలముగాఁ గలవు. కాని, ఈ యాశ్వయుజ మాసమున నీదినముల నీకార్యములు దేవిచే నాచరింపఁబడిన వను నాధారము కన్పట్టదు. విశేషించి శరన్నవరాత్ర ప్రస్తావసమయముననే వేఱొక కొన్నిదినములు గూడ ముఖ్యముగాఁ బరిగణింపఁబడి యుండుటవలన ఈదినములే దేవీవిజయప్రస్థానదినము లనుట కొంతదనుకఁ బ్రత్యాఖ్యాత మగుచున్నది. ఆశ్వయుజమాసాదియు, చైత్రమాసాదియు నవరాత్రవ్రతమునకు గ్రహింపఁబడుటకుఁ గారణములు దేవీభాగవతమున—

శ్లో॥ శృణు రాజన్ ప్రవక్ష్యామి నవరాత్రవ్రతం శుభం, శరత్కాలే విశేషేణ కర్తవ్యం విధిపూర్వకం, వసంతే చ ప్రకర్తవ్యం తథైవ ప్రేమపూర్వకం, ద్వావృతూ యమదంష్ట్రాఖ్యౌ నూనం సర్వజనేషు వై, శరద్వసంతనామానౌ దుర్గమౌ ప్రాణినామిహ, తస్మాద్యత్నా దిదం కార్యం సర్వత్ర శుభమిచ్ఛతా, ద్వావేవ సుమహాఘోరా- వృతూ రోగకరౌ నృణాం, వసంత శరదావేవ జననాశకరా వుభౌ, తస్మాత్తత్ర ప్రకర్తవ్యం చండికా పూజనం బుధైః" అని చెప్పఁబడినదే గాని, యందుఁ గారణాంతర ముపన్యసింపఁబడలేదు. అందే మఱియొక్క చోట "అష్టమ్యాం చ చతుర్దశ్యాం నవమ్యాం చ విశేషతః, సుమపూజా ప్రకర్తవ్యా—అని చతుర్దశీ సహితముగాఁ జెప్పఁబడి యున్నది. శాక్తాగమములు, పురాణములు తంత్రములు నసంఖ్యములు. అనంతములు. అట్టి వానిలో నేదేని ప్రబలాధారము చిక్కెనో విజ్ఞులకు విచార్యము. శరన్నవరాత్రమును దేవీవిజయములతోఁ గలుపు విశేషవిషయము చొప్పడకున్నను దుష్టశిక్షార్థము యుగయుగంబుల నవతరించి జగద్రక్షణ మొనర్చు జగన్మాత జగత్పూజ్యయనుటకు సందియము కలదా?

అధిష్ఠాన దేవతాస్వరూపము.

ఆర్యమత మెల్లవిధముల ననవద్యము అన్యమతముల వలె గాక ఇది మొదటి నుండియు జిజ్ఞాసువుల బుద్ధి వైచిత్ర్యముల నెఱిఁగి తత్తదుచిత క్రియాకలాపమును నిర్మించినది. ఇట్టి సామరస్య పరాయణత యితరమతము బందు లేదు. మనుష్యులు కేవలము ప్రాకృతస్థితిలో నుండు సమయమున వారికొఱకు విగ్రహారాధనాదికము చెప్పఁబడినది. విగ్రహపూజాధురంధరుఁడైనవాఁడే విగ్రహమునకు మూలమైన మూర్తిని గుఱించి విచారింపఁదొడంగినపుడు పురాణేతిహాస ముఖమున నీతిబోధకము లైన తదవతార చరిత్రములు వర్ణింపఁబడినవి. ఇఁకఁ గొంత జ్ఞాన మలవడి, జిజ్ఞాసు వవతార తత్త్వవిమర్శనమునకు గడంగినపుడు, జగత్సృష్టిస్థితిలయాధికారి యైన సగుణబ్రహ్మము లేక - యీశ్వరస్వరూపము నిరూపింపఁబడినది. ఏవం రూపోపాసనలచేఁ జిత్తశుద్ధి గలిగి-పూర్ణాధికారియైన వానికి, సగుణ బ్రహ్మమున కతీత మైన యధిష్ఠానము - లేక నిర్గుణబ్రహ్మస్వరూపము బోధింపఁబడినది. మఱియు నేకౌషధప్రయోగన్యాయమునఁ గాక, క్రియాతత్పరునకుఁ గర్మయోగద్వారమునను, కాయక్లేశసహనశీలునకు హఠయోగద్వారమునను, ఊహాపోహవిచక్షణునకు జ్ఞానయోగద్వారమునను, రసలిప్సువునకు భక్తియోగద్వారమునను, ఇష్టసిద్ధిప్రాప్త్యుపాయములు చెప్పఁబడినవి. ఇట్లు మందానుజిఘృక్షచేఁ బూర్వర్షులు చేసిన యనంతవిభాగములు చూడఁగా, వారి సర్వజ్ఞత్వము వ్యక్త మగుచున్నది. భాగవతసప్తమస్కంధముకొనను విగ్రహారాధన మత్యంత ముత్కర్షింపఁబడి యున్నది. ఆ గ్రంథమందే వేఱొకచో ప్రతిమార్చనము ఖండింపఁబడినది. సామాన్యపాఠకుఁడు వీని వైరుద్ధ్యమును జూచి భాగవతకర్తకు మతవిషయమున నిశ్చితాభిప్రాయము లే దని తలంచును. కాని పరమకారుణికుఁ డైన వేదవ్యాసుఁడు ఎవ్వని కేది చెప్పిన నుపయోగమో, అది వానికిఁ జెప్పుచున్నాఁ డని తెలిసికొనఁ జాలఁడు. ఆర్యమతమున, బుద్ధిభేదము చేయరా దని ఘంటాఘోషముగాఁ జెప్పఁబడినది. ఎవ్వఁ డేని ఏవిధముగా నేని, ఈశ్వరారాధన తత్పరుఁడై యున్నయెడల నీతిబాహ్యక్రియ లున్న వానిని దిద్దవచ్చును. గాని వానిబుద్ధికి వాఁడుచేయు పూజయం దెన్నటికిని వికల్పముఁ గల్పింపరాదు. గీతల యభిప్రాయము నిదియే. శుద్ధాద్వైత ప్రతిష్ఠాపకుఁడై - బ్రహ్మమున కెట్టి విధమైన రూపమును గాని నామమును గాని యంగీకరింపని-శ్రీమచ్ఛంకరభగవత్పాదులు విగ్రహారాధనముఁ జేయుచుండిరి. ఇది స్వార్థముగాక శిష్య ప్రరోచనార్థ మనుట విశదము కదా. మఱియు మన యార్యమతమున 'నర్థవాద' మని యొకటి కలదు. ఎవ్వఁ డేరూపమున నీశ్వరుని బూజించుచున్నాఁడో, లేక యే వ్రతము చేయుచున్నాఁడో, దానిని ఇతరము లన్నిఁటికంటె నధిక మని యుత్కర్షించి పొగడుట స్తుత్యస్తుతి యందురు. ఇం దుద్దేశ్యము భక్తుని బుద్ధి నన్యమునుండి మఱలించి చేయుచున్న కార్యమునందు స్థిరీకరింపఁజేయుటయే. కాని కలలోనైన నితరవ్రతములఁగాని యితర దేవతలఁ గాని దూషింపవలయు నని కాదు. ఇది యెఱుంగక పురాణములు పరస్పరవిరుద్ధము లని కొందఱు, శైవ వైష్ణవాది భేద ప్రతిపాదకము లని కొందఱు, తత్త్వ మెఱుంగక విభ్రాంతిపాలగుచున్నారు. స్థూలము లైన వ్రతావతార విషయములనే గాక ఇట్టి సామరస్యము తత్త్వప్రతిపాదకము లైన షడ్దర్శనములందుఁ గూడఁ గల దనియు, అవి పరస్పరవిరుద్ధములు గాక జ్ఞానసౌధారోహణమునకు సోపానము లనియుఁ వానికిఁ బర్యవసాన మద్వైతమం దనియు శ్రీవివేకానందస్వాములవారు చెప్పియున్నారు.

2. పూర్వము శిష్యుఁడు గురూపదేశపూర్వకముగనే విద్య నధిగమింపవలసి యున్నందున నాతనికి శాస్త్రములయందు సందేహము కలుగుట లేదు. శిష్యుని ప్రజ్ఞ నెఱిఁగి, గురువు ఏది యెంతవఱకు ఎపుడు చెప్పిన శిష్యునకుఁ దెలియునో, యది యంతవఱకు అబ్బుచున్నందున విగ్రహారాధన మెంతవఱ కుపాదేయమో, కర్మ లెంతవఱకుఁ గర్తవ్యములో, యోగ మెంతవఱ కాచరణీయమో, యవి యెప్పు డనవసరములో శిష్యునకుఁ దెలియుచుండెడివి. ఇప్పు డన్ననో, ఇతర గ్రంథములవలె నధ్యాత్మగ్రంథములును ముద్రితములై యొక్కసారిగా మనపాలఁబడినందున, భేదములను సమన్వయించుకొనఁజాలక, వైక్లబ్యమును బొరయుచున్నారము. ఈ విపత్తునకుఁ దోడు పాశ్చాత్య సంసర్గమువలనఁ బ్రాచీనవస్తువుల ననాదరబుద్ధియు నెలకొన్నందున, దేశమున మతాభిరతి నష్టప్రాయమై, సకలకష్టముల కాకర మగు

చున్నది. తొంటివలె నధ్యాత్మవిద్యఁ గఱపు గురుకులము లేర్పడినఁ గాని, ఈ కొఱంత తొలఁగ దనుట సత్యము.

8. చార్వాకులో కాయతికాదు లల్పసంఖ్యాకులు తప్ప సకల మతస్థులును జగత్కారణ మైన యధిష్ఠానము నంగీకరించుచున్నారు. అద్వైతు లియ్యది నామరూపరహిత మనియు వాక్కునకును మనస్సునకును అతీత మనియుఁ జెప్పుచున్నారు. ఇదియే నిర్గుణ బ్రహ్మము. ఇట్టి నిర్గుణబ్రహ్మము శక్తిమంతమై సృష్టిస్థితి సంహారసమర్థ మైన యెడ, సగుణ బ్రహ్మ మనియు ఈశ్వరుఁ డనియు వ్యవహరింపఁబడు చున్నది. ఈ యీశ్వరుఁడు సర్వజ్ఞుఁడు. సర్వాంతర్యామి. సర్వశక్తి. ఈ తత్త్వము నద్వైతులు ఈశ్వరుఁడని వ్యవహరించినట్లే వైష్ణవులు (మహా) విష్ణు వనియు, శైవులు (పరమ) శివుఁ డనియు, శాక్తులు లలిత యనియుఁ ననేక నామముల వ్యవహరింతురు. ఇట్లెల్లరును నామభేదములు కల్పించుచున్నను, ఈతత్త్వమందు వారు వర్ణించు గుణములు సర్వజ్ఞత్వాదులే. దీనినిబట్టి వస్త్వైక్యమును నామ మాత్రభేదమును సిద్ధాంతిత మగుచున్నది.

ఈశ్వరుఁ డవతరించినట్లే లలితయుఁ దత్తత్కార్య నిర్వహణ నిమిత్త మవతరించుట కూర్మాదిపురాణములయందుఁ జెప్పఁబడినది, ఈశ్వరుఁడు గుణభేదమునఁ ద్రిమూర్తుల ధరించినట్లే, దేవియుఁ మహాకాళీ మహాలక్ష్మీ మహాసరస్వతీరూపముల ధరించినది. శక్తితోఁ గూడుకొనియున్నఁ బరబ్రహ్మము (శివుఁడు) ప్రభువు కానేరఁడు. జగత్తున్నఁ గదా యీశ్వరునకు జగన్నాథత్వము. కావున సగుణ విభవ మెల్ల శక్త్యధీనమై యున్నది. ఈ యర్థమును శంకరాచార్యులు సౌందర్యలహరిలో నిట్లు చెప్పిరి:—

శ్లో॥ శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చే దేవం దేవో న ఖలు కుశల స్స్పందితు మపి
అత స్త్వా మారాధ్యాం హరిహర విరించి ప్రభృతిభిః
ప్రణన్తుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి?

ఉ. శక్తిని గూడినన్ శివుఁడు శక్తుఁ డగున్ బ్రభవంబునందుఁ ద
ద్వ్యక్తిఁ దొలంగినన్ గదలనోపఁ డతం డటుగావునన్ మహా
భక్తి హరాచ్యుతాబ్జముఖవంద్యను నిన్ గొనియాడ మ్రొక్కఁగాఁ
బ్రాప్తసుపుణ్యహీనుఁ డగువానికి నెట్లు ఘటిల్లు నీశ్వరీ!

ఇది పై శ్లోకమునకు నా చేసిన యనువాదము.

నిర్గుణమైన పరతత్త్వమునకును శక్తికిని గల సంబంధము వేదాంతశాస్త్రములలో ననేకవిధములఁ జర్చింపఁబడినది. ఇది బ్రహ్మమునకు భిన్నమా? భిన్నాభిన్నమా? సావయవమా? నిరవయవమా? ఉభయాత్మకమా? సత్తా? అసత్తా? సదసత్తా? ఇత్యాదిచర్చ అమూల్యమైనది కారికలయందును భాష్యములందును జేయఁబడి యున్నది. ఈవిషయమై సీతారామాంజనేయమునుండి యొక్క పద్య ముదాహరించుచున్నాఁడను:—

సీ. వటబీజమున మహా వటమహీరుహ శక్తి
యుజ్జ్వలవహ్నియం దుష్ణశక్తి
ఇంద్రజాలకునియం దెపుడు మాయాశక్తి
కలితోపలములందుఁ గఠినశక్తి
సలిలజాలము లందు సలలితద్రవశక్తి
పవనంబునం దతిస్పందశక్తి
హరి శుక్లశోణితంబులయందుఁ దనుశక్తి
తను శరీరములఁ జైతన్యశక్తి
తే. తనరి యవ్యక్త మగుచుఁ దత్తన్నిదాన
మై యధిష్ఠానమున కంటె నవికరంబు
నగు పగిది నొప్పు బ్రహ్మమం దాత్మశక్తి
యేర్పడక యవ్యమై విశ్వహేతు వగుచు.

జగన్మిథ్యాత్వ మనుభవమునకు రాక ప్రపంచము సత్య మని నమ్మి యెంతదనుక మనము వ్యవహారదశయం దుందుమో, యంతవఱ కీశ్వరుఁడు మన కుపాస్యుఁడు. శక్తి యుపాస్య. ధర్మార్థకామములు శక్త్యధీనములు. మోక్షహేతు వైన జ్ఞానము తత్ప్రసాదైకసాధ్యము. కాఁబట్టి శక్తిపూజనము ఎల్లవిధముల మనకుఁ గర్తవ్యము. దేవీమహిమ ప్రతిపాదకములైన స్తోత్రములలో యధికారవాదము స్పష్టముగా గావచ్చుచున్నది. దీనివలన – భక్తుడు – యోగి – ఉపాసకుడు – తత్త్వజ్ఞుడు – సమముగా దేవ్యారాధనము నొనర్చి యానందింప ననువుపడుచున్నది.

పూజ్యాదధికారులు:-

ఇట్టి సౌలభ్య మున్నది గనుక నే ఈపూజ చాతుర్వర్ణమునకు మాత్రమే గాక యితరులకును ఉపదేశింపఁబడి యున్నది. ఇట్లు ఇది యెల్లర కనుష్ఠేయముగా నున్నను, క్షత్త్రియులకును ముఖ్యముగా రాజన్యులకును యభిహితము. దుర్గాష్టమి నాఁడు రాజులు పూర్తి చేయవలసిన లోహాభిసారిక మను కర్మ యుద్దిష్ట మైనది. ఇందు రాజు ప్రాక్ప్రవణ మైన దేశమున షోడశహస్తప్రమాణ మైన మండపముచేసి, యచ్చట నాగ్నేయమూల నొకకుండ మేర్పఱచి ఛత్త్ర శస్త్రాస్త్రముఖ్య రాజచిహ్నముల మండపమునొద్దకుఁ దెచ్చి యర్చించి వందిఘోష పురస్సరముగాఁ గజాశ్వములతో నూరేగవలయును. ఛత్త్ర, చామర, శంఖాదులకు గావింపవలసిన పూజావిధానమును, శత్రు విజయప్రస్థానమునకు రాజు పోవలసిన తెఱఁగును విస్తరముగా గ్రంథములయందుఁ జెప్పఁబడియున్నది. నిర్ణయసింధ్వాది గ్రంథములఁ బట్టి చూడఁగా నీవ్రతము దేశమం దెల్ల మున్ను మిగుల వ్యాప్తిలో నున్నట్టు తెలియుచున్నది. అనేక కారణములవలన దేశమునకుఁ గ్రమక్రమముగాఁ బ్రాప్తించిన దౌర్గత్యమువలనను క్షత్త్రియ ప్రభ్వభావమువలనను ఈ జాతీయోత్సవ మాత్మీయవైభవమును గోలుపోయి నేఁటికిఁ బులివేషములుగాను, బైరాగివేషములుగాను బరిణమించినది.

2 బ్రాహ్మణులలోను ఈ శరన్నవరాత్రి తత్త్వ మెఱింగినవా రల్పసంఖ్యాకులే. శాక్తులలో నుత్తరసంప్రదాయ మను వామమార్గ మొకటి యేర్పడి యాశాఖవారు మంత్రముల కపార్థములు కల్పించి

